ఆశ్చర్యకరం!
రస్న పిల్లల కోసం!
ఆశ్చర్యకరం!
రస్న తల్లుల కోసం!




క్రొత్త రస్న
స్పైడర్‌మాన్
ప్యాక్!




ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రైప్ □ గ్రేప్ గ్రోవ్

# తాజాదనం చిందించే రస్న

11 పసందైన రుచులు సరసమైన ధరలో.

Mudra:A:EAMR:4570 Tel

# PAGE

ప్యారీస్ మిఠాయిలు మరియు బిస్కట్లు అందరికీ యిష్టం




చెట్లు వగటి నమయంలో నీటిని కోల్పోతాయి. పెద్దచెట్లు నేలలోంచి కావలసినంత నీటిని పీల్చుకో గలవు. ఆ నీటిని ఆకులద్వారా బయటకు పంపి స్తాయి. ఆ నీరు ఎంత వుంటుందో తెలుసా. వేడి ఎక్కువగా వున్న రోజున ఆ నీరు యాభయి పెద్ద బకెట్లలో నిండు తుంది.



ఈ ప్రయోగాన్ని మీరే స్వయంగా చేసి ఏమవుతుందో చూడవచ్చు. ఆకులతో కప్పివున్న ఒక చెట్టుకొమ్మ మీద ఒక ప్లాస్టిక్ సంచీ వుంచండి. సంచీ మూతిని కొమ్మకి గట్టిగా బిగించి కట్టండి. అలాగే మూడు రోజులు వుంచండి. సంచీ లోపల ఎంతో నీరు చేరి వుండడం మీరు చూస్తారు. పగటి పూట వేడి ఎక్కువగా వుంటే సంచీలో ఎక్కువగా నీరు చేరుతుంది.

## మీకు తెలుసా?

అందరిలాగానే చేపకు కూడా సముద్రపు అనారోగ్యం వస్తుం దని మీకు తెలుసా? ఒక బకెట్‌లో వాటిని వుంచి నీటిని గిరగిరా తిప్పుతూ వుంటేనూ లేకపోతే ఓడమీద ఎక్కించినప్పుడు వస్తుంది. అయితే సముద్రంలో వున్నప్పుడు మటుకు రాదు.







## మీ పతాకాలు తెలుసుకోండి !

ప్రపంచంలో అనేక దేశాల నుంచి వచ్చిన ప్రయాణీకులు ఈ టూరిస్టుబస్‌లో వున్నారు. మీకు జెండాల గురించి తెలిస్తే, ఏ ప్రయాణీకుడు ఏ దేశానికి చెందుతాడో మీకు సులభంగా తెలుస్తుంది.

జవాబు: A—స్విట్జర్‌లాండ్; B—ఇండియా; C—రష్యా D—టర్కీ; E—జపాన్; F—ఇంగ్లండు; G—అమెరికా.




THE KING OF SWEETS

CUT AND KEEP



# చందమామ

ఏప్రిల్ 1989



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00
సంవత్సర చందా: 36-00

A CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కానుక''] కు ఆధారం, ''వసుంధర'' రచన.

ఈ సంచికతో ''ఐదుప్రశ్నలు'' సీరియల్ ముగిసింది. రాబోయే సంచిక నుంచి, ''తండ్రీ కొడుకులు'' సీరియల్ ప్రారంభమవుతుంది. ఈ కథ **1947-48** లో ప్రచురించబడి, ఎంతగానో పాఠకుల ఆదరాభిమానాలకు పాత్రమైంది. వయసూ, దానితోపాటు జీవితానుభవాల్లో వుండే తారతమ్యాల కారణంగా, తండ్రీ కొడుకుల మధ్య కలిగే విభేదాలను వ్యంగ్య, హాస్య ధోరణిలో, యీ కథ వివరిస్తుంది. ఇది ఈ తరం పాఠకులనూ అహ్లాద పరచగలదని నమ్ముతున్నాం.

సంపుటి 84 ఏప్రిల్ '89 సంచిక 4

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00

CHITRA

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించీ




4 మాసాలు నించీ




6 మాసాలు నించీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

## చందమామ కబుర్లు



### గుండుసూది తలపై విజ్ఞాన సర్వస్వం

బ్రిటిష్ విజ్ఞానవేత్తలు 'ఎలక్ట్రాన్‌బీమ్'ను రూపొందించి వున్నారు. ఈ ఎలక్ట్రాన్ బీమ్ ప్రక్రియ ద్వారా బ్రిటిష్ విజ్ఞాన సర్వస్వం (ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా) 29 సంపుటాలనూ ఒక గుండుసూది తల మీద ఇమడ్చడం సాధ్యమవుతుంది. ఒక పెన్సిల్ గీత మీద పదిలక్షల అక్షరాలూ, సూది తల మీద పదిలక్షల రంధ్రాలూ చేయడం, దీని ద్వారా సాధ్యమవుతుంది।

### బాలమేధావి

వేలూరుకు చెందిన బాలమురళి అంబటి అనే 11 ఏళ్ళ కుర్రవాడు తన మేధాసంపత్తితో అమెరికా విద్యావేత్తలను ఆశ్చర్య చకితుల్ని చేశాడు. ఈ బాలమేధావి మూడేళ్ళ వయసులోనే ఆంగ్లంలో అనర్గళంగా మాట్లాడడం, రాయడం ప్రారంభించాడు. నాలుగేళ్ళలో గుణకార భాగాహారాలు నేర్చేసుకుని బేసిక్ కాల్‌కులస్ ప్రారంభించాడు।





### విమానంతో రైలుపోటీ!

'ట్రాన్స్‌రాపిడ్' మేగ్నటిక్ లెవిటేషన్ ట్రెయిన్ — వేగంలో విమానాలకు పోటీ కాగలదు. మునుముందు హానొవర్—హాంబర్గ్ నగరాల మధ్య ప్రత్యేకంగా నిర్మించిన పట్టాలపై ఈ రైలు రాకపోకలు ప్రారంభమవుతాయి।

### థాయ్‌లాండ్ పురాతన రాజధాని!

25 సంవత్సరాలుగా జరిపిన పరిశోధనలు, త్రవ్వకాలు ఫలితంగా థాయ్‌లాండ్ ప్రాచీన రాజధానీనగరం వెలుగులోకి వచ్చింది. శతాబ్దాలుగా మూసుకుపోయిన మట్టినీ, అల్లుకుపోయిన అడవులూ తొలగించి, విజ్ఞానవేత్తలు—700 సంవత్సరాలకు పూర్వం వెలసిన సుఖోతాయ్ నగర శిథిలాలను కనుగొన్నారు. ఆ 'స్వర్ణయుగం' నాటి 193 బౌద్ధాలయాలు, కందకాలూ, ఇటుక అవములూ వెలుగులోకి వచ్చాయి।



# నిజం విలువ

శిళ్ళంగేరి గ్రామంలో, బంగారయ్య ఇంట్లో, రాత్రివేళ ఒక గజదొంగ ప్రవేశించి, బంగారయ్యకూ, అతడి భార్యకూ కత్తి చూపించి, "మీ ఇంట్లో బంగారు నగలూ, డబ్బూ ఎక్కడ దాచారో చెప్పండి. చెప్పకపోయారో మిమ్మల్ని ప్రాణాలతో వదలను," అన్నాడు.

"మా ఇంట్లో ఏమీ లేదు," అని మొండిగా నిజం చెప్పడానికి నిరాకరించారు, భార్యాభర్తలు.

అంతలో వాళ్ళ పదేళ్ళకొడుకు, దొంగతో, "నేను నిజం చెబుతాను. అదిగో, ఆ కనబడే కొయ్యపెట్టిలో, ఇరవై బంగారుకాసులున్నవి. అంతే!" అన్నాడు.

దొంగ ఇల్లంతా వెతికిచూస్తే, ఆ ఇరవై బంగారుకాసులు తప్ప, మరేం దొరకలేదు. వాడు, బంగారయ్య కొడుకును, "నీ తల్లిదండ్రులలాగే, నువ్వూ ఏమీ లేదని ఎందుకు అబద్ధం చెప్పలేదు? నిజమే ఎందుకు చెప్పావు?" అని ప్రశ్నించాడు.

అందుకు కుర్రవాడు, "మా నాన్నకూ, అమ్మకూ నిజం, అబద్ధాల విలువలు తెలియవు. నాకు బాగా తెలుసు. అందుకే నేను నిజం చెప్పాను," అన్నాడు.

"అయితే నిజం విలువ ఎంత? అబద్ధం విలువ ఎంత?" అని దొంగ అడిగాడు.

"నిజం విలువ మా అమ్మా, నాన్నల ప్రాణాలు. అబద్ధం విలువ ఇరవై బంగారుకాసులు. నిజంతో మా అమ్మా, నాన్నలను కొనుక్కోగలిగాను. అబద్ధంతో ఇరవై బంగారుకాసులు మాత్రం కొనుక్కోగలిగివుండేవాణ్ణి," అన్నాడు కుర్రవాడు.

దొంగ, పిల్లవాడి తెలివికి సంతోషించి, ఆ ఇరవైకాసులూ యిచ్చేసి వెళ్ళిపోయాడు.

—కోలార్ కృష్ణ అయ్యర్





# పిశాచాలసాయం

మంగళాపురం అనే ఒక పెద్ద గ్రామానికి దాపుల్లో వున్న అడవిలో, ఒక మర్రిచెట్టు మీద రెండు పిశాచాలుండేవి. అవి చాలా పరోపకారబుద్ధి గలవి. ఒకనాటి మిట్ట మధ్యాహ్నంవేళ, అవి కునికిపాట్లు పడుతున్న సమయంలో, ఏదో అలికిడి అయి, అవి మేలుకున్నవి.

బలిష్ఠంగా వున్న మనిషొకడు చెట్టు ఎక్కి, తన రొండిన వున్న వరహాలమూటనొకదాన్ని చెట్టు తొర్రలో దాచి, చెట్టు దిగి వెళ్ళిపోసాగాడు. వాడు, ఆ ధనాన్ని ఎక్కడో దొంగిలించాడని, పిశాచాలకు అర్థమైపోయింది. వెంటనే అవి రెండూ, చెట్టు దిగి వాణ్ణి వెంబడించాయి.

దొంగతనం చేసినవాడు, మంగళాపురంలోని వరహాలశెట్టి ఇంటికి వెళ్లాడు. పిశాచాలు కూడా ఇంట్లో ప్రవేశించి, అటక ఎక్కి కూర్చున్నవి. వరహాలశెట్టి, ఇంట్లోకి వచ్చినవాణ్ణి, "ఒరే, భీమన్నా! వరహాలమూట ఒకటి కనబడడం లేదు. ఇల్లంతా వెదికాను. నువ్వేమైనా చూశావా?" అని అడిగాడు.

"వరహాలమూట కనబడకుండా పోయిందా!" అంటూ భీమన్న ఆశ్చర్యం నటించి, తానూ వెదకడం ప్రారంభించాడు.

మరొకసారి, ఇల్లంతా వెదికి విసిగిపోయిన వరహాలశెట్టి, "నిన్న చలమయ్య బజార్లో ఎదురుపడి, ఆ వరహాలమూట యిచ్చాడు. తను తాకట్టుపెట్టిన వస్తువుల కోసం, యిప్పుడు వస్తాడు," అని బాధపడసాగాడు.

"అయ్యా, మీకు చలమయ్య డబ్బు యిచ్చేటప్పుడు, దగ్గిర మరెవరైనా వున్నారా?" అని అడిగాడు భీమన్న.

"ఎవరూ లేరు," అన్నాడు వరహాలశెట్టి.

అయ్యగారి శర్మ



"అయితే ఒక పని చెయ్యండి. డబ్బివ్వ లేదని చలమయ్యను బుకాయించండి. ఎదురుతిరిగితే, నేను చూసుకుంటాను," అన్నాడు భీమన్న మీసం మెలివేస్తూ.

ఈ సలహా వరహాలశెట్టికి నచ్చింది. అంతలో చలమయ్య అక్కడికి వచ్చి, తన తాకట్టువస్తువు లిమ్మని వరహాలశెట్టి నడిగాడు.

వరహాలశెట్టి తాపీగా, "అదేంటి, చలమయ్యా! డబ్బిస్తేగాని తాకట్టుపెట్టిన వస్తువులు రావని తెలీదా ?" అన్నాడు.

దానికి చలమయ్య కంగారుపడి, తాను నిన్ననే డబ్బు యిచ్చిన సంగతి, వరహాలశెట్టికి గుర్తుచేశాడు.

వరహాలశెట్టి ముఖాన్ని గంభీరంగా పెట్టి, "నువ్వు, నాతో వేళాకోళమాడడం లేదుకద! నాకలాంటివాళ్ళంటే చెడ్డ చిరాకు," అన్నాడు.

చలమయ్యకు, వరహాలశెట్టి పథకం అర్థం అయి, అతడి కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డాడు. వరహాలశెట్టి, అతణ్ణి భీమన్నచేత బయిటికి గెంటించాడు. తల వంచుకుని పుట్టెడు దిగులుతో పోతున్న చలమయ్యను, పిశాచాలు అనుసరించాయి.

చలమయ్యను చూస్తూనే, అతడి భార్య తాకట్టువస్తువుల గురించి అడిగింది. అందుకతడు జరిగినదంతా భార్యకు చెప్పి, "నిన్న రామయ్య యిచ్చిన సొమ్మంతా వరహాలశెట్టి కాజేశాడు. తాను, నా దగ్గిర హామీగా వుంచిన పొలం పత్రాలకోసం, రామయ్య యివ్వాళ వస్తానన్నాడు," అన్నాడు.

చలమయ్య దిగులు చూసి, అతడి భార్య తేలిగ్గా నవ్వేస్తూ, "వరహాలశెట్టి పథకాన్నే, మనమూ అమలుచేద్దాం. రామయ్య మీకు డబ్బిచ్చినట్టు, సాక్ష్యం ఏమీ లేదు కదా!" అన్నది.

ఈలోగా తలుపు చప్పుడయింది. తలుపు తీయగానే, రామయ్య లోపలికి వచ్చాడు. చలమయ్య పెద్దగా నవ్వుతూ, "ఏం,

రామయ్యా! ఉన్న ఒక్క కూతురుకూ పెళ్ళి చేశావు. నీకిక చీకూ చింతా ఏముందిలే," అన్నాడు.

రామయ్య కూడా నవ్వుతూ, "మీదయ వల్ల, ఆ భారం తగ్గించుకున్నాను. నిన్నటితో మీ అప్పూ తీరింది. పొలం హామీ పత్రాలు యిస్తారేమో అని వచ్చాను," అన్నాడు.

అందుకు చలమయ్య ఎక్కడలేని ఆశ్చర్యం నటిస్తూ, "అప్పు తీరడం ఏమిటి, రామయ్యా! నువ్వు సొమ్ము యిస్తే గద తీరడానికి," అన్నాడు.

రామయ్య ఆ మాటలు విని లబోదిబో మన్నాడు. అయినా చలమయ్య ఏమాత్రం చలించకుండా, "చూడు, రామయ్యా! మతిమరుపువాడివని తెలిసి కూడా, నీకు అప్పు యివ్వడం నాదే పొరబాటు. ఇకనైనా గుర్తుతెచ్చుకుని, త్వరలో నాకు చేరవలసిన సొమ్ము చెల్లించు, తెలిసిందా?" అన్నాడు.

రామయ్య ఏమీ చెప్పలేక, గుడ్లనీరు కుక్కుకుంటూ బయిటికి వెళ్ళాడు. జరిగిన తతంగమంతా చూసిన పిశాచాలకు, రామయ్యకు సహాయం చేసి—శెట్టీ, చలమయ్యల మోసం బయటపెట్టాలనిపించింది. వెంటనే అవి పెద్ద మనుషుల్లా రూపాలు మార్చుకుని, రామయ్యను సంగతేమిటని అడిగాయి. రామయ్య వాటికి, తనకు జరిగిన అన్యాయం సంగతి చెప్పి బావురుమన్నాడు.





చలమయ్య సంతోషంగా డబ్బు తీసుకుని, వెంటనే రామయ్యకు పత్రాలిచ్చి పంపేశాడు.

ఇదంతా గమనిస్తున్న చలమయ్య భార్య, "వాడి మతిమరుపు మనకు మేలే చేసింది. వాడు మతిమరుపు నుంచి బయటపడి, మన ఇంటికి వచ్చేలోగా, ఈ సొమ్మును వరహాలశెట్టి కిచ్చి, మన వస్తువులు తీసుకురండి," అని చెప్పింది భర్తకు.

చలమయ్య, వరహాలశెట్టి ఇంటికి వెళ్ళి, చేసిన అన్యాయం ఊరికే పోదని అతణ్ణి తిట్టి, సొమ్ము యిచ్చాడు. వరహాలశెట్టి మారుమాట్లాడకుండా, చలమయ్యకు తాకట్టు వస్తువులు అప్పగించాడు.

చలమయ్య వెళ్ళాక, వరహాలశెట్టి డబ్బు సంచితో గదిలోకి పోబోతూండగా, ఇద్దరు రక్షకభటులు వచ్చి, న్యాయాధికారి అతణ్ణి ఉన్నపళంగా కచ్చేరీకి రమ్మన్నట్టు చెప్పారు. వరహాలశెట్టి ఆశ్చర్యపోయి, భీమన్నను వెంట బెట్టుకుని కచేరీకి వెళ్ళాడు.

కచేరీలో కొలువు తీరివున్న న్యాయాధికారి పక్కన, పెద్దమనుషుల రూపంలో పిశాచాలు నిలబడి వున్నవి. న్యాయాధికారి, వరహాలశెట్టిని, "ఏమయ్యా, నువ్వీ పెద్దమనుషుల నుంచి వంద వరహాలు

పిశాచాలు వెంటనే ఒక డబ్బు సంచి సృష్టించి రామయ్యకు యిచ్చి, చేయవలసిందేమిటో చెప్పాయి. రామయ్య ఆ సొమ్ముతో చలమయ్య ఇంటికి వెళ్ళి, తలుపు తట్టాడు.

చలమయ్య తలుపు తీస్తూనే, "మళ్ళీ వచ్చావెందుకు?" అంటూ మండిపడ్డాడు.

రామయ్య తాపీగా, "నా మతిమరుపు మండిపోను! ఇందాక, మీకు సొమ్ము యిద్దామని వచ్చి మర్చిపోయాను. ఈ సొమ్ము తీసుకుని, నా పొలం తాకట్టు పత్రాలు యివ్వండి. మీ మేలు మరవను," అంటూ, పిశాచాలు యిచ్చిన డబ్బు సంచిని, చలమయ్యకు యిచ్చాడు.

దొంగిలించావట! నిజమేనా?" అని ప్రశ్నించాడు.

"ఇదెక్కడి చోద్యం! నేనింతవరకూ, వీళ్ళ ముఖాలే చూడలేదు," అన్నాడు వరహాలశెట్టి ఆశ్చర్యపోతూ.

పిశాచాలు, వరహాలశెట్టి రొండినవున్న మూటను చూపిస్తూ, "అదుగో, ఆ డబ్బు సంచీ మాదే!" అన్నవి.

"ఇది మరీ విడ్డూరం! ఈ సంచీలో వున్నది తాకట్టుసొమ్ము. ఇది మీదే అనడానికి రుజువేమిటి?" అని ప్రశ్నించాడు వరహాలశెట్టి.

"మూటలోని ప్రతి వరహా మీదా, మర్రిచెట్టుముద్ర వుంటుంది. అదే రుజువు!" అన్నవి పిశాచాలు నవ్వుతూ.

న్యాయాధికారి, సంచీలోని వరహాల మీద, మర్రిచెట్టు ముద్ర వుండడం చూసి, వరహాలశెట్టితో, "నీ దొంగతనం బయట పడింది," అన్నాడు కోపంగా.

వరహాలశెట్టి, తనకా సొమ్మును చలమయ్య యిచ్చాడని చెప్పాడు. చలమయ్యను, న్యాయాధికారి ప్రశ్నించగా, ఆ సొమ్ము రామయ్య యిచ్చాడంటూ గోలపెట్టాడు.

రామయ్య, న్యాయాధికారికి పెద్దమనుషుల రూపంలో వున్న పిశాచాలను చూపుతూ, "చలమయ్య, నన్ను మోసగించాడు. నేను దుఃఖిస్తూండడం చూసి, వీరు నాకు ఆ సొమ్ము యిచ్చారు," అన్నాడు.



ఇక చేసేదిలేక, చలమయ్య తాను చేసిన మోసం ఒప్పుకుని, తనకు వరహాల శెట్టి చేసిన అన్యాయం గురించి, న్యాయాధికారికి చెప్పాడు.

అప్పుడు వరహాలశెట్టి భయంతో వణికిపోతూ, తన నేరం ఒప్పుకుని, న్యాయాధికారితో, "అయ్యా, ఇదంతా భీమన్న సలహా కారణంగా జరిగింది," అంటూ అంతా ఆయనకు వివరించాడు.

అంతా విన్న న్యాయాధికారికి, వరహాల శెట్టి ఇంట్లో వరహాల మూటను ఎవరు దొంగిలించారన్న అనుమానం కలిగింది. ఆయన భీమన్న కేసి కోపంగా చూస్తూ, "ఒరే, భీమన్నా! ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు, అవునా?" అంటూ గద్దించాడు.

భీమన్న యిక లాభం లేదని, నిజం చెప్పేశాడు. వాడు చెప్పిన గుర్తుల ప్రకారం రక్షకభటులు పోయి, చెట్టు తొర్రలో దాచిన వరహాలమూటను తెచ్చి, న్యాయాధికారి ముందు పెట్టారు.

పెద్దమనుషుల రూపంలో వున్న పిశాచాలు, న్యాయాధికారితో, "తమకు కలిగిన నష్టాన్ని యితరుల మీదికి నెట్టి, లాభపడాలనే వ్యక్తులవల్ల, రామయ్య లాంటి అమాయకులకు అన్యాయం జరుగుతూంటుంది. అందుకే మేము, రామయ్యకు డబ్బు యిచ్చి సాయపడ్డాం," అన్నవి.

న్యాయాధికారి భీమన్నకూ, వరహాల శెట్టికీ, చలమయ్యకూ తగిన శిక్షలు విధించి, పిశాచాలను, "మా గ్రామంలో వున్న ఇద్దరు మోసగాళ్ళను పట్టిచ్చారు. అలాగే ఒక అన్యాయం జరక్కుండా ఆపారు. అంతా బాగానే వుంది కానీ— ఇంతకూ, ఈ మోసాన్ని గురించిన సర్వం మీకెలా తెలిసింది?" అని ప్రశ్నించాడు ఆశ్చర్యంగా.

"ఆ ప్రశ్నకు సమాధానం చెబితే, మీరు తప్పక భయపడిపోతారు!" అంటూ నవ్వి పిశాచాలు అడవిదారిపట్టాయి.

ఆ సమాధానం అర్థం కాకపోయినా, న్యాయాధికారి కూడా నవ్వేశాడు.





# ప్రేమ-ద్వేషం

కమలుడనే యువకుడు సంగీతప్రియుడు. ప్రతిరోజూ వాడు తనకు లభించిన పరికరం మీద, సంగీతసాధన చేస్తూ, ప్రావీణ్యం సంపాయించేవాడు.

ఒక రోజున వాడు నదికిపోయి, స్నానం చేసి తిరిగివస్తూండగా, వేణువు ఒకటి దొరికింది. కమలుడు ఆ రోజు నుంచీ వేణువుతో సాధన చేయసాగాడు.

ఉన్న సమయాన్నంతా వేణుగానం తోనే వృథా చేస్తున్నాడని, కమలుణ్ణి తల్లి దండ్రులు మందలించారు. అందుకువాడు, ''సంగీతాన్ని నేను ప్రేమిస్తున్నాను. మీరు ఏమి చెప్పినా చేస్తాను. సంగీతం గురించి మాత్రం నన్నేమీ అనకండి,'' అన్నాడు.

''అలా అయితే, సంగీతాన్ని ఒక క్రమ పద్ధతిలో అభ్యసించాలి. ఏ గురువునైనా ఆశ్రయించి, సంగీతంలో మెలుకువలు తెలుసుకో,'' అన్నారు తల్లిదండ్రులు.

ఈ సూచన కమలుడికి నచ్చింది. అయితే, వాడున్న గ్రామంలో సంగీతం నేర్పే గురువులు లేరు. చపలుడనేవాడు మాత్రం, కొంతకాలం పట్నంలో వుండి, సంగీతం నేర్చుకుని వచ్చాడు. కమలుడు, చపలుణ్ణి కలుసుకుని సలహా అడిగాడు.

చపలుడిది కుత్సితస్వభావం. కమలుడి మాటలు వింటూనే వాడెంతో సంతోషాన్ని నటించి, ''నాకు తెలిసినవిద్య ఎవరికైనా నేర్పాలని వున్నది. నీకంటే మంచి శిష్యుడు దొరకడు. నావద్ద కొంత నేర్చుకున్నాక, పట్నం వెళ్ళి పెద్ద గాయకులకు శిష్యుడివవుదువుగాని. ముందుగా నీకు సంగీతంలో ఏపాటిప్రవేశంవున్నదో తెలుసుకోవాలి కాబట్టి, నీకు వచ్చిన విద్యను, నా ముందు ప్రదర్శించు,'' అన్నాడు.

కమలుడు చపలుడి ముందు వేణుగానం చేశాడు.

శ్రీరామకమల్

చపలుడది విని తెల్లబోయాడు. గురువుల వద్ద నేర్చుకున్నప్పటికీ కూడా, వాడికామాత్రం సంగీతపాటవం అబ్బలేదు. కమలుడి ప్రావీణ్యతకు లోలోపల అసూయపడి, వాడు, ''అబ్బే! నీ పాట నిండా అపస్వరాలే. నువ్వు సంగీతం నేర్చుకునేందుకు అర్హుడివి కాదు. ఏవో లల్లాయి పాటలు పాడుకుంటూ కాలక్షేపం చెయ్యి," అన్నాడు.

అ మాటలు విన్న కమలుడికి ఎంతో నిరుత్సాహం కలిగింది. తను ఎంతో కాలాన్ని వృథా చేశానని కోపం కూడా వచ్చింది. వాడు వేగంగా ఇంటికి వెళ్ళి, తన వేణువును తల్లి కిచ్చి, ''అమ్మా, దీన్ని పొయ్యిలో వేసి మంటపెట్టు. జీవితంలో మళ్ళీ సంగీతం జోలికి వెళ్ళను,'' అన్నాడు.

తల్లి, వాణ్ణి అడిగి జరిగిందేమిటో తెలుసుకుని, ''చపలుడు, అలా అన్నాడని నువ్వు సంగీతమే మానేస్తావా? ఇదేం బుద్ధిరా నీకు! వాడికి నీ పాట విని అసూయపుట్టి, నిన్ను చులకనగా మాట్లాడేశాడు,'' అన్నది.

''వాడి అసూయ కారణంగా, నేను సంగీతం మానేశానని ఊళ్లో అందరికీ తెలియాలి. అప్పుడు అందరూ వాణ్ణి తిడతారు. ఏమైనాసరే, ఇక నేను మాత్రం సంగీతం జోలికి వెళ్ళను,'' అన్నాడు కమలుడు.

ఈ మాటలు దూరంగా వున్న కమలుడి తండ్రి విని, కొడుకు దగ్గరకు వచ్చి, ''సరే, నాయనా, అంతా నీ యిష్టం. నీకు సంగీతం మీద వున్న ప్రేమకంటే, చపలుడిపైనున్న ద్వేషం ఎక్కువైనప్పుడు, సంగీతాన్ని వదిలిపెట్టడం న్యాయమే! నీకు తోచినట్టే చెయ్యి,'' అన్నాడు.

తండ్రి మాటలతో కమలుడికి, తన ఆలోచనలోని పొరబాటు తెలిసివచ్చింది. వాడు చపలుడిపై ద్వేషం వదిలిపెట్టి, పట్నం వెళ్ళి మంచి గురువుల నాశ్రయించి, పట్టుదలగా సంగీతం నేర్చుకుని, వేణుగానంలో తనకుతానే సాటి అనిపించుకున్నాడు.





# ఐదు ప్రశ్నలు

## 5

మరునాడు వచ్చిన ధీరసింహుడితో, ''ఇక్కడికి ఈశాన్యదిక్కున 'శబ్దభేది' అనే పర్వతం ఉన్నది. ఆ పర్వతంలోని విశేషాలేమిటి? పర్వతానికి అవతల వున్న రాజ్యం ఏది? ఇదే నా ఐదవ ప్రశ్న,'' అన్నది సులోచన.

ధీరసింహుడు ఆమెవద్ద మూడునెలలు గడువు తీసుకుని, గుర్రం మీద ఈశాన్య దిక్కుగా పయనమయ్యాడు. మార్గ మధ్యంలో అనేక పల్లెలూ, పట్టణాలూ దాటుకుని ఏడు రోజులు ప్రయాణం చేసి అతడొక మహారణ్యం చేరుకున్నాడు. ఎండ తీవ్రంగా వుండడంవల్ల, గుర్రం దిగి దానిని ఒక చెట్టుకు కట్టి, చెట్టు నీడలో కూర్చున్నాడు. ఉన్నట్టుండి పక్షుల కలకలారావం వినిపించింది. ఆ తరవాత అడవి దద్దరిల్లే విధంగా రకరకాల జంతువుల అరపులు వినిపించాయి. క్రమ క్రమంగా ఆ శబ్దం తనను సమీపించడం గ్రహించి, ధీరసింహుడు చెట్టెక్కి, శబ్దం వస్తూన్న దిక్కుకేసి చూసి, అక్కడి దృశ్యానికి దిగ్భ్రాంతి చెందాడు.

జింకలూ, ఏనుగులూ, పులులూ, నక్కలూ మొదలైన వన్యమృగాలన్నీ అరుస్తూ పరుగులు తీస్తున్నవి. నాలుగు కాళ్ళతో, పొడవాటి తోకతో, నిప్పులు కక్కే కళ్ళతో ఒక వింతమృగం ఆ మందను తరుముకుని వస్తున్నది. ఆ వింతమృగం



నుంచి తప్పించుకోవడానికే వన్యమృగా లన్నీ హడలిపోయి, పరిగెత్తుతున్నవి.

ఆ మృగాలన్నీ కొన్ని క్షణాలలో ధీర సింహుడు వున్న చెట్టు దాటుకుని వెళ్ళి పోయాయి. ఆ సందడిలో ధీరసింహుడి గుర్రం కూడా ఎటో పారిపోయింది. వింతమృగం చెట్టు పైకి చూసి, చిటారు కొమ్మపై వున్న ధీరసింహుడి మీదికి లంఘించింది. వెంటనే ధీరసింహుడు కత్తిదూసి మృగం తలను నరికాడు. తల తెగలేదు కానీ, ఆ దెబ్బకు మృగం ఎగిరి దూరంగా పడింది.

ధీరసింహుడు కిందికి దూకి, మృగంతో భయంకరంగా పోరాడి, ఖడ్గంతో దాని పొట్టను చీల్చాడు. అది దిక్కులు పిక్కటిల్లేలా అరిచి ప్రాణం వదిలింది!

ధీరసింహుడు దాని గోళ్లూ, కోరలూ కోసి భద్రపరచుకుని ముందుకు నడిచాడు. అతడు మరునాటి సాయం కాలానికి ఒక నగరం చేరుకున్నాడు. నగరం నిండా భవనాలూ, ఉద్యాన వనాలూ వున్నాయి. కాని, మనిషి జాడ కనిపించలేదు. అతడు రాజప్రాసాదం దగ్గరికి వెళ్ళాడు. ఒక భటుడు వచ్చి, "ప్రభువులు రమ్మన్నారు," అన్నాడు.

ధీరసింహుడు అతని వెంట రాజ భవనంలో ప్రవేశించాడు. రాజు విచార వదనంతో కూర్చుని వున్నాడు. ఆయన ధీరసింహుణ్ణి చూడగానే, "నువ్వెవరో పరదేశస్థుడివిలా వున్నావు. నా నగరం సిరిసంపదలకు నిలయం. అయినా, ప్రజలకు సుఖశాంతులు కరువయ్యాయి. సమీపఅరణ్యంలో ఒక వింతమృగం నివసిస్తున్నది. అది హఠాత్తుగా నగరం మీద పడి మనుషులను భక్షించి వెళు తున్నది. దానిని హతమార్చడం గాని, బంధించడంగాని మా తరం కావడంలేదు. అందువల్ల ప్రాణభీతితో ప్రజలందరూ నగరాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయారు. నగరం మరుభూమిలా అయింది. చూశావు కదా!" అన్నాడు దిగులుగా.



"అవును, చూశాను. అయితే మీరుచెప్పే వింతమృగాన్ని నేను నిన్న మధ్యాహ్నమే హతమార్చాను," అంటూ తను తెచ్చిన వింతమృగం గోళ్లనూ, కోరలనూ రాజుకు చూపించాడు ధీరసింహుడు.

రాజు వాటిని చూసి పరమానందం చెంది, "ఇంత కాలానికి నా ప్రజలకు ప్రాణరక్షణ ప్రసాదించావు. ఇప్పుడే చాటింపు చేయించి నా ప్రజలను తిరిగి రప్పించుకుంటాను. నీ మేలు మరువలేను. ఇక్కడికి నువు ఎందుకు వచ్చావు? నా సహాయం ఏదైనా కావాలంటే చెప్పు, చేస్తాను," అన్నాడు రాజు.

"నేను శబ్దభేది పర్వత రహస్యాలను తెలుసుకోవాలని వెళుతున్నాను. అక్కడికి వెళ్లేమార్గం చెబితే చాలు," అన్నాడు ధీరసింహుడు.

"ఆ పర్వతం ఇక్కడికి పది ఆమడల దూరంలో వున్నది. దాన్ని అనుకునే శబ్దభేది పట్టణం ఉన్నది. అయినా, మూడు రోజులు మా ఆతిథ్యం స్వీకరించి ఆపైన వెళుదువుగాని," అన్నాడు రాజు.

ధీరసింహుడు అక్కడ మూడు రోజులు గడిపి, ఇద్దరు రాజభటులు వెంటరాగా, శబ్దభేది పట్టణం చేరుకున్నాడు. పట్టణానికి ఉత్తర దిక్కుగా ఎత్తయిన పర్వతం ఉన్నది. ఆ పర్వత విశేషాలను సేకరించాలని ధీరసింహుడు ఒక సత్రంలో బస చేశాడు. అక్కడ అతనికి పలువురు పరిచయమై అతని మంచితనంవల్ల స్నేహితులయ్యారు. ముఖ్యంగా వీరవర్మ అనే యువకుడు ధీరసింహుడికి ప్రాణస్నేహితుడయ్యాడు.

ఒకనాడు ధీరసింహుడూ, వీరవర్మా నగర వీధిలో వెళుతూ వుండగా, మేఘ గర్జనలాగా, "రా, త్వరగా రా," అనే కేక వినిపించింది. వెంటనే ఒక దుకాణంలో కూర్చుని వున్న ఒక కుర్రవాడు లేచి వెర్రివాడిలా పర్వతంకేసి పరిగెత్త సాగాడు. వాణ్ణి పట్టుకోవడానికి ధీరసింహుడు ప్రయత్నించాడు. కాని, అంత



లోనే వాడు అందుకోలేని దూరానికి వెళ్ళిపోయాడు.

ధీరసింహుడు అమితాశ్చర్యంతో, "వీర వర్మా, ఆ కేక ఎవరిది? ఆ యువకు డెందుకు అలా పరిగెత్తుతున్నాడు?" అని అడిగాడు మిత్రుణ్ణి.

"ఆ కేక శబ్దభేది పర్వతం నుంచి వస్తుంది. అది ఎవరిని ఉద్దేశించి వస్తుందో వాళ్ళు సర్వాన్ని మరిచిపోయి కొండకేసి పరుగు తీస్తారు. అలా వెళ్ళిన వాళ్ళెవరూ ఇంతవరకు తిరిగి రాలేదు. వాళ్ళను గురించి దుఃఖించడంవల్ల ప్రయోజనం లేదు కాబట్టి ఎవరూ విచారించరు కూడా," అన్నాడు వీరవర్మ.

"ఆ కేక ఎందుకు వస్తుంది?" అని అడిగాడు ధీరసింహుడు.

"ఆ రహస్యం ఎవరికీ తెలియదు," అన్నాడు వీరవర్మ.

"అలా వెళ్ళేవాళ్ళను వెంబడించి వెళితే విషయం తెలుస్తుంది కదా!" అని అడిగాడు ధీరసింహుడు.

"అలా చేయడానికి ఎవరూ సాహసించలేదు," అన్నాడు వీరవర్మ.

ధీరసింహుడు ఆ తరవాత ఏమీ మాట్లాడలేదు. మౌనంగా ఆలోచించసాగాడు. ఇరువురూ కలిసి తాము బస చేసివున్న సత్రం చేరుకున్నారు.

వారం రోజుల తరవాత ఒకనాటి సాయంకాలం, ధీరసింహుడూ, వీరవర్మా ఒక ఉద్యానవనంలో కూర్చుని వున్నారు. ఆ సమయంలో మేఘగర్జనవంటి "రా, త్వరగా రా!" అనే కేకతో ఆ ప్రదేశం మారుమ్రోగింది. మరుక్షణమే ధీరసింహుడి ఎదట కూర్చుని వున్న వీరవర్మ కొండకేసి నడవసాగాడు. ధీరసింహుడు "ఆగు వీరవర్మా ఆగు," అని అరుస్తూ అతణ్ణి వెంబడించాడు. అయినా అతడు వినిపించుకోలేదు. అతణ్ణి పట్టుకోవాలని ధీరసింహుడు పరిగెత్తగానే, అతనికి అందకుండా వీరవర్మ మరింత వేగంగా కొండకేసి పరుగుతీశాడు. ధీరసింహుడు

వదలకుండా అతని వెంట పరిగెత్తుతూనే వున్నాడు. ఇరువురూ కొండను ఎక్కారు. వారి కొక పెద్ద బండ అడ్డు తగిలింది. వీరవర్మ దానిని అవలీలగా దాటాడు. ధీర సింహుడు ఒక్క గెంతుతో దానిని దాటాడు. ఇద్దరూ పచ్చిక మైదానంలో పరుగెత్తు తున్నారు. హఠాత్తుగా పెద్ద శబ్దంతో భూమి రెండుగా బద్దలయింది. వీరవర్మ అగాధం లోకి పడిపోయాడు. మరుక్షణమే భూమి ఎప్పటిలా మూసుకుపోయింది!



ధీరసింహుడు విచారంతో చుట్టు పక్కల కలయజూసి, ఎదురుగా కనిపించిన కొండ శిఖరం కేసి నడిచాడు. కొంతదూరం వెళ్ళేసరికి భరించరాని వేడి అతణ్ణి ఆవరించింది. మరి కొంత దూరం నడిచేసరికి అతనికొక అగ్నినది కనిపించింది. ఆ అగ్నినదీ తరంగాలు జ్వాలల్లా ఆకాశాన్ని అంటుతున్నవి. ఆ నదిని దాటడం ఎలాగా అని అతడు ఆలోచిస్తూ ఒక బండమీద కూర్చున్నాడు. ఇంతలో సూర్యాస్తమయ మయింది. భయానకమైన ఆ వాతావరణంలో అర్ధ రాత్రివరకు గడిపి, అక్కడే ఒక బండ మీద పడుకుని నిద్రపోయాడు. మనిషి తలా, సింహం శరీరమూ గల ఒక విచిత్ర ఆకారం కలలో కనిపించి, "ధీరసింహా, అగ్ని నదికి ఆవలిగట్టున అగ్నినాభుడనే రాక్షసుడు వజ్రాలపర్వతానికి కాపలా కాస్తు న్నాడు. నదిలో ఒక పడవ కనిపిస్తుంది. ధైర్యంతో నదిని దాటి సూర్యోదయం కాగానే వాణ్ణి హతమార్చు. నీ కార్యం విజయమవుతుంది." అని దీవించింది.

ధీరసింహుడు కళ్ళు తెరిచి చూశాడు. తూర్పుదిక్కు తెల్లబడుతున్నది. అతడు అగ్నినదీ తీరానికి చేరాడు. అగ్నినదిలో ఒక పడవ కనిపించింది. ధీరసింహుడు ధైర్యంగా గట్టు మీదినుంచి, ఆ పడవలోకి ఒక్క గెంతున దూకాడు. పడవ తిన్నగా ఆవలిగట్టుకు చేరింది. ఇంతలో భయం కరాకారుడైన ఒక రాక్షసుడు, "నా అను మతి లేకుండా నా భూమిలో అడుగు



మోపిన నరాధముడు ఎవడు?'' అని హుంకరిస్తూ అక్కడికి వచ్చాడు. వెంటనే ధీరసింహుడు తన ఖడ్గంతో వాడి తలను తెగవేశాడు. మరుక్షణమే వాడొక దివ్య పురుషుడుగా మారి, ''నేను నా మిత్రుడికి తలపెట్టిన ద్రోహం కారణంగా ఇలా రాక్షస జీవితం గడపవలసి వచ్చింది. నీ కారణంగా శాపవిముక్తి కలిగింది. కృతజ్ఞుణ్ణి,'' అని ధీరసింహుడికి నమస్కరించి ఆకాశ మార్గంగుండా ఎగిరిపోయాడు.

ధీరసింహుడు సంతోషంగా ముందుకు నడిచాడు. చుట్టుపక్కల ప్రదేశమంతా వెండిలా తళతళా మెరుస్తున్నది. అక్కడి తటాకంలో నీళ్ళు వెండిలా మెరుస్తున్నవి. దాహంగా వుండడంతో ధీరసింహుడు వంగి, ఆ నీళ్ళను దోసిలిలోకి తీసుకున్నాడు. నీళ్ళు తగిలినంతవరకు రెండు చేతులూ వెండిగా మారిపోయాయి. నీళ్ళను అలాగే వదిలి ఈ వింతకు ఆశ్చర్యపడుతూ ధీరసింహుడు మరి కొంత ముందుకు నడిచాడు. అక్కడ అతనికొక బంగారుద్రవతటాకం కనిపించింది. తటాకం నిండా బంగారు తామరలు పూచి వున్నాయి. అక్కడ కనిపించిన ఒక బంగారు పడవ సాయంతో ఆ తటాకాన్ని దాటి కొండశిఖరాన్ని చేరుకున్నాడు. ఎక్కడ చూసినా, మణులూ, మాణిక్యాలూ వజ్రాలూ రాసులు రాసులుగా ఉన్నవి. వాటి కారణంగా కొండ ఒక ఇంద్రధనుస్సులా వింతకాంతులు వెదజల్లుతున్నది. అప్పుడు, ''వీటిలో ఆరు వజ్రాలు మాత్రం తీసుకో నీకు శుభమవుతుంది!'' అని ఒక అశరీరవాణి వినిపించింది. ధీరసింహుడు అలాగే ఆరు వజ్రాలు మాత్రమే తీసుకుని, ముందుకు నడిచాడు.

కొంత దూరంలో నిర్మల జలంతో నిండుగా ప్రవహించే ఒక నది కనిపించింది. ఆ నదిలో అతడు హాయిగా కాళ్ళు చేతులు కడుక్కున్నాడు. వెంటనే అంతకు పూర్వం వెండిలా మారిన చేతులు ఇప్పుడు

మామూలుగా మారిపోయాయి. అయినా గోళ్ళు మాత్రం అలాగే వెండివిగానే వుండి పోయాయి. ప్రవాహంలో కొట్టుకుని వచ్చిన ఒక పడవనెక్కి, అవతలి గట్టు చేరాడు. అక్కడి అరణ్యాన్ని దాటి ఒక గ్రామం చేరుకున్నాడు. అతనికి ఎదురుపడిన గ్రామస్థు డొకడు నమస్కరించాడు.

"నన్ను చూసి ఎందుకలా భయపడుతున్నావు? ఈ గ్రామం ఏ రాజ్యంలోనిది?" అని అడిగాడు ధీరసింహుడు.

"మీరు ముమ్మూర్తులా మా యువరాజులాగే వున్నారు. ఇది మా నేపాళ రాజ్య సరిహద్దు గ్రామం," అన్నాడు ఆ గ్రామస్థుడు.

పరమానందంతో ధీరసింహుడు అక్కడి నుంచి బయలుదేరి, కౌశాంబీ నగరం చేరుకుని, సులోచనను చూడబోయాడు. అప్పుడు ఆస్థాన పండితుడు సుధాకరాచార్యుడు కూడా అక్కడే వున్నాడు. ఇరువురూ ధీరసింహుడికి స్వాగతం పలికారు. ధీరసింహుడు శబ్దభేది పర్వతంలో తాను చూసిన వింతలనూ, విశేషాలనూ వివరించి, ఆ పర్వత శిఖరం నుంచి తెచ్చిన వజ్రాలనూ, వెండిగా మారిన తన చేతి గోళ్ళనూ చూపాడు.

అంతా విన్న సుధాకరాచార్యుడు, "ధీరసింహా, భూలోకంలో నువు సాధించలేని విజయం లేదు. నీ ధైర్య సాహసాలు సాటిలేనివి. నీ పరోపకార బుద్ధి మానవ జాతికే మకుటాయమానమైనది," అని, సులోచనకేసి తిరిగి, "నువ్వు అడిగిన ఐదు ప్రశ్నలకూ సమాధానాలు తెలుసుకు వచ్చాడు ధీరసింహుడు. నువు కోరుకున్న ధీరోదాత్త లక్షణాలుగల ఈ నేపాళ రాజకుమారుణ్ణి వివాహమాడడానికి సమ్మతమే కదా?" అన్నాడు.

సులోచన చిరునవ్వుతో అంగీకారం తెలిపింది. ఒక శుభ ముహూర్తాన సులోచనా, ధీరసింహుల వివాహం వైభవోపేతంగా జరిగింది. ధీరసింహుడు చాలాకాలం ప్రజారంజకంగా పరిపాలన జరిపాడు. —(అయిపోయింది)






# కానుక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, శయనాగారంలో సుఖనిద్రలో వుండవలసిన నువ్వు, ఇలా భీతిగొల్పే శ్మశానంలో యిక్కట్లకు గురి కావడం చూస్తూంటే నాకు జాలి కలుగ తున్నది. నువ్వు ఎంతో ధైర్యశాలివేగాక ఎన్నో విద్యల్లో ఆరితేరిన సుగుణవంతుడి వని, నాకు తోస్తున్నది. అలాంటి నీలో ఏపాటి అయినా గర్వం వుండడం తప్పనిపించుకోదు. కాని, నిన్ని పనిక పురిగొల్పినవాళ్ళు, ఒకవేళ అల్పబుద్ధు లైతే గోరంతదాన్ని, కొండంతచేసి అవ హేళన చేయగలరు. ఇందుకు ఉదా హరణగా, ఒక గ్రామాధికారి కథ చెబు

## బేతాళ కథలు



తాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

భూషయ్య అనే అతను, సీతాపురం గ్రామాధికారి. ఆయనకు చాలా విద్యల్లో ప్రవేశమున్నది. రాచకార్యాల మీదఆయన చాలా ఊళ్ళు తిరుగుతూండేవాడు. ఎక్కడికి వెళ్ళినా, తనకు అంతులేని మర్యాదలు జరుగుతున్నవనే వాడాయన. ఊళ్ళోవాళ్ళందరూ, ఆయన అదృష్టాన్ని మెచ్చుకునేవారు.

ఒకసారి భూషయ్య విద్యానగరం వెళ్ళవలసి వచ్చింది. సీతాపురానికి, విద్యానగరం చాలా దూరం. అక్కడికి వెళ్ళాలంటే, దారికూడా సుగమం కాదు. చూడ్డానికి విద్యానగరం భూతల స్వర్గంలా వుంటుందనీ, ఆనగరవాసులు మర్యాదలో, వారికి వారే సాటి అనీ అందరూ చెప్పుకునేవారు.

సీతాపురంలోని గ్రామపెద్దలు నలుగురు, విద్యానగరం వెళ్ళాలనుకుంటున్నారు. వాళ్ళు భూషయ్యను కలుసుకుని, "అయ్యా, తమరు రాచకార్యం మీద, విద్యానగరం వెళ్ళబోతున్నట్టు విన్నాం. ఆ నగరం చూడాలని, మాకెంతో కోరికగా వున్నది. మీతోపాటు మమ్మల్ని కూడా తీసుకువెళ్ళండి. ఆ విధంగా, అక్కడ మీకు జరిగే మర్యాదలూ చూస్తాం; మీతోపాటు మేమూ గౌరవసత్కారాలు పొందుతాం. కాదనకండి!'' అన్నారు.

భూషయ్య కాసేపాలోచించి, "గౌరవ సత్కారాలు, వారి వారి అర్హతలనుబట్టి జరుగుతాయి. నాకు జరిగే విధంగా, మీకవి జరక్కపోతే, మీకు బాధగా వుంటుందేమో, ఆలోచించుకోండి. మిమ్మల్ని తీసుకు వెళ్ళేందుకు, నాకే అభ్యంతరమూ లేదు,'' అన్నాడు.

భూషయ్య చెప్పినదానికి, పెద్దలు నలుగురూ సరే అన్నారు. భూషయ్య అందరికోసం ప్రత్యేకమైన రథాన్ని సిద్ధం చేశాడు. అందువల్ల ప్రయాణం ఒక్క రోజులో ముగిసింది.



విద్యానగరంలో అడుగు పెట్టగానె, రాజప్రతినిధి పంపగా వచ్చినవాడొకడు, భూషయ్యను కలుసుకుని, "మీరయిదు గురున్నారా? మంచి వసతి ఏర్పాట్లు, ఒక్కరికి మాత్రమే జరిగాయి. ఇప్పుడేం చేసేది?" అని బాధపడ్డాడు.

"వీరు నలుగురూ, నా మిత్రులు. వీరికి వేరే సత్రంలో బస ఏర్పాటుచేసినా, ఏమీ అనుకోరు," అన్నాడు భూషయ్య వెంటనే.

"అయ్యా, మీ మిత్రులకమర్యాద జరగనిస్తామా?" అంటూ ఆ వచ్చిన వాడు, అప్పటికప్పుడు అందరికీ, రాజ భవనంలో ప్రత్యేకవసతి ఏర్పాట్లు చేయిం చాడు. ఆ ఏర్పాట్లు చాలా ఘనంగా వుండడంతో, సీతాపురం గ్రామపెద్దలు నలుగురూ, భూషయ్యనెంతగానో పొగిడారు.

విద్యానగరం వజ్రవైడూర్యాలకు పెట్టింది పేరు. భూషయ్య వజ్రాల దుకాణానికి వెళ్ళి, రెండు వజ్రాలు తీసు కున్నాడు. రాజప్రతినిధి, ఆ వజ్రాలను అయనకు ఊరికే యివ్వడమే గాక, అయన మిత్రులందరికీ కూడా, అలాంటివే తలా రెండు వజ్రాలు యిప్పించాడు.

భూషయ్యకు లలితకళల్లో ప్రవేశ మున్నదని తెలిసి, అయన కోసం సంగీత, ప్రదర్శనలూ, కవితాగోష్ఠులూ ఏర్పాటు చేయబడ్డాయి.

అన్నిటిలోనూ భూషయ్యతోపాటు, సీతాపురం గ్రామపెద్దలు కూడా పాల్గొని, తమకు తెలిసినంతలో, తామూ నాలుగు మాటలు చెప్పారు.

రాజప్రతినిధి, భూషయ్యను మెచ్చు కుంటూ, "మీ ఊరిలో మీరే కాదు, అందరూ లలితకళల్లో ఆరితేరినవారే!" అన్నాడు,

చివరిరోజున అంతా కలిసి, విద్యానగ రంలో ప్రఖ్యాతి చెందిన మహేశ్వరుడి ఆలయానికి దైవదర్శనార్థం వెళ్ళారు. వేరే ఏదో పని వుండడంవల్ల, రాజప్రతినిధి



మాత్రం వాళ్ళ వెంట రాలేదు. వాళ్ళు దైవదర్శనం చేసుకుని బయటికి రాగానే, హఠాత్తుగా పెద్ద జడివాన ప్రారంభమైంది.

రాజప్రతినిధి అనుచరుడైన, రంగదాసనేవాడు, ఆలయ ప్రాంగణంలో వున్న గొడుగొకటి తెచ్చి, భూషయ్య మీద వాన పడకుండా చేశాడు. మిగిలిన పెద్దలు నలుగురూ, వానలో బాగా తడిసిపోయారు.

విద్యానగరానికి భూషయ్య వచ్చిన పని అయిపోయింది. భూషయ్యతో, ఆయన మిత్రులకూ, రాజోద్యోగులు రకరకాల కానుక లిచ్చారు.

తిరుగుప్రయాణమయ్యేముందు, సీతాపురం ఊరి పెద్దలు, భూషయ్యతో, "ఇక్కడ ఎవరికైనా కానుకగా యివ్వ వచ్చునన్న ఉద్దేశ్యంతో, కొన్ని వస్తువులు తెచ్చాం. కొందరు మనకు వజ్రాలనిచ్చారు. కొందరు రత్నకంబళ్ళు యిచ్చారు. కొందరు మంచి విందుభోజనం పెట్టారు. ఎవరికేం యివ్వాలో, మాకు తెలియడం లేదు. తెచ్చిన వస్తువులను పరీక్షించి, రాజప్రతినిధితో సహా ఎవరికేమిస్తే బావుంటుందో, తమరే నిర్ణయించండి!" అని కొన్ని వస్తువులు భూషయ్యకు చూపారు.

భూషయ్య వాటివంక చీదరించుకుంటున్నట్టు చూసి, "ఇలాంటి వస్తువులు గొప్పవారి కివ్వడానికి పనికిరావు. వీటన్నిటినీ, రాజప్రతినిధి అనుచరుడైన రంగదాసుకిస్తే బావుంటుంది," అని రంగదాసును పిలిచి, వాటిని కానుకగా యిచ్చాడు.

అంతా కలిసి, సీతాపురం తిరిగి వెళ్ళాక, ఊరి పెద్దలు నలుగురిలోనూ కాస్త చిన్నవాడు, "భూషయ్యగారూ, మీతో కలిసి ఊళ్ళు చూడడం అదృష్టం. మళ్ళీ ఇలాంటి అవకాశం వస్తే తప్పక పిలవండి," అన్నాడు.

భూషయ్య ఏదో అనేలోగానే, ఊరి పెద్దల్లో కాస్త పెద్దవాడు, చిన్నవాణ్ణి మందలించి, "వచ్చిన అవకాశానికి సంతోషించు. రాచకార్యాల మీద వెళ్ళే

వాళ్ళు, అస్తమానూ మిత్రులను వెంట బెట్టుకుని వెళ్ళడం మంచిది కాదు. భూషయ్యగారికి నేనూ కృతజ్ఞుణ్ణే. కాని, ఇకమీదట ఆయనతో ప్రయాణం చేసి యిబ్బంది పెట్టను.'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఊరిపెద్ద అంత మర్మంగా మాట్లాడినా, భూషయ్య అంటే అతడికున్న ఈర్ష్య తెలుస్తూనే వున్నది. అది అల్పబుద్ధి అనిపించుకోదా? ఆ ఈర్ష్యకు కారణం ఏమిటి? అతడెందుకంత కృతఘ్నుడుగా మాట్లాడాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అలా మాట్లాడిన ఊరిపెద్ద చాలా సునిశితబుద్ధి కల వాడు. మిగతా ముగ్గురూ, భూషయ్యను సరిగా అర్థం చేసుకోలేకపోయారు. భూషయ్యకు మొదటి నుంచీ, తనతో సమానంగా మిగతా నలుగురూ గౌరవ మర్యాదలు పొందడం యిష్టం లేదు. తన నుంచి వాళ్ళను వేరు చేయాలని, వసతి సౌకర్యాల దగ్గిరనుంచి ప్రయత్నాలు చేశాడు. కాని, విద్యానగరవాసులూ, రాజప్రతినిధీ ఎంతో మర్యాదస్థులు కావడంవల్ల, అది సాగలేదు. అక్కడ మిగతా నలుగురికన్న, భూషయ్యపట్ల ప్రత్యేక గౌరవం చూపినవాడు రంగదాసొక్కడే! వాన కురుస్తున్నప్పుడు, వాడు గొడుగును భూషయ్యకు పట్టాడు. కాని, మర్యాదకోసమైనా, వాడు మిగిలిన పెద్దలతో, యింకా గొడుగులు తేలేనందుకు విచారిస్తున్నట్టు అనలేదు. అందువల్లనే వాడు, భూషయ్యకు నచ్చాడు. తనతోపాటు, మిగిలిన నలుగురినీ గౌరవించిన వాళ్ళెవరికీ, అతడు కానుకలివ్వదలచుకోలేదు. భూషయ్య కేవలం గర్విష్ఠే కాదు; మంచీ మర్యాదలు తెలియని అహంకారి!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఇద్దరు సలహాదార్లు

అక్కవరం గ్రామంలో అమరయ్య, రంగయ్య అనే అన్నదమ్ము లుండేవారు. వాళ్ళిద్దరి మధ్య ఎంతో సఖ్యం వుండేది. ఊరిపెద్దలుగా, కష్టాల్లో వున్నవాళ్ళను ఆదుకుంటూ, అవసరం అయినవాళ్ళకు మంచి సలహాలిస్తూండేవాళ్ళు. ఈ పని, ఎవరు సమయానికి ఇంట్లో వుంటే, వాళ్ళు చేస్తూండేవాళ్ళు.

అయితే, ఇందులో రంగయ్య ఒక వింత విషయం గమనించసాగాడు. అది—తన అన్న అమరయ్య యిచ్చిన సలహా ఎలాంటిదైనా, ఆ ఊళ్ళో వాళ్ళు మారుమాట లేకుండా పాటిస్తున్నారు. కాని, తను యిచ్చిన సలహాలను మాత్రం అంతగా పాటించడం లేదు. కొందరు తను యిచ్చిన సలహాలకు వ్యతిరేకంగా కూడా ప్రవర్తిస్తున్నారు. దీనికి కారణం ఏమిటో, రంగయ్యకు బోధపడలేదు.

ఒకనాడు రంగయ్య అన్నను, "నువ్వు యిచ్చిన సలహాలను ఊళ్ళోవాళ్ళు తిరుగులేని విధంగా అమలు చేస్తారు. కాని, నా సలహాల విషయంలో అలా జరగడం లేదు. దీనికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

తమ్ముడు అడిగినదానికి అమరయ్య చిరునవ్వునవ్వి, "ఈ విషయంలో నీకొక సలహా యివ్వాలనుకుని, తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాను. ఇదుగో, ఇప్పుడు నువ్వు, నీ అంతట నువ్వే అడిగావు కాబట్టి, ఈసారి నేను ఎవరికైనా సలహా యిచ్చేటప్పుడు జాగ్రత్తగా గమనించు!" అన్నాడు.

అంతలో అక్కడికి చంద్రయ్య అనే రైతు వచ్చి, "అమరయ్యగారూ, ఈ సంవత్సరం నేను మంచి ఇల్లొకటి కట్టించుకోవాలనుకుంటున్నాను. కాని, నా

పెంటకోట సోమినాయుడు

భార్య, నా కూతురు పెళ్ళి జరిపించ మంటున్నది. ఈ రెంటికీ తగినంత డబ్బు, నా దగ్గరలేదు. అందుచేత, ముందుగా ఏ పని చేయాలన్నది, నాకు తోచక మిమ్మల్ని సలహా అడుగుదామని వచ్చాను,'' అన్నాడు.

''మీ అమ్మాయి వయసెంత?'' అని అడిగాడు అమరయ్య.

''పదిహేను సంవత్సరాలు,'' అని చెప్పాడు చంద్రయ్య.

''మంచి సంబంధం, ఏదైనా సిద్ధంగా వున్నదా?'' అని ప్రశ్నించాడు అమరయ్య.

''లేదండీ, ఇక సంబంధాలకోసం వెత కాలి,'' అని జవాబిచ్చాడు చంద్రయ్య.

అప్పుడు అమరయ్య, చంద్రయ్యతో, ''చూడు, చంద్రయ్యా! మీ అమ్మాయికి యింకా సరిగా పెళ్ళీడు రాలేదు. అందు వల్ల ముందుగా ఈ సంవత్సరం, ఇల్లు కట్టించు. ఆ తర్వాత, అమ్మాయి పెళ్ళి గురించి డబ్బు కూడబెట్టవచ్చు. ఒకవేళ అంతగా కూడబెట్టలేకపోయినా, సొంత ఇల్లంటూ వున్నది గనక, దాని మీద అప్పు చేయవచ్చు,'' అన్నాడు.

అమరయ్య యిచ్చిన సలహా, చంద్రయ్యకు అద్భుతంగా తోచింది. అతడు అలాగే చేస్తానని చెప్పి వెళ్ళి పోయాడు.



ఇంతలో నారయ్య అనే రైతు వచ్చి, అమరయ్యకు నమస్కారం చేసి, ''అయ్యా, మా అమ్మాయికి సీమంతం చేయ తలపెట్టాం. ఎలాగూ చేస్తున్నాం కాబట్టి, అ చేసేదేదో ఘనంగా చేయాలను కుంటున్నాం. కాని, వచ్చిన చిక్కేమంటే, సమయానికి చేతిలో తగినంత డబ్బు లేదు. అందువల్ల, మా ఎద్దులు రెంటినీ అమ్మేద్దామనుకుంటున్నాం నేనూ, మా ఆవిడా. మీరేం సలహా యిస్తారు?'' అని అడిగాడు.

''నారయ్యా, అలాగే చెయ్యి!'' అని అమరయ్య సలహా యిచ్చాడు. నారయ్య తృప్తిగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఇది చూసిన రంగయ్య, అమరయ్యతో, ''నువ్వు చంద్రయ్యకు చెప్పిన సలహా బాగానే వున్నది. కాని, నారయ్యకు చెప్పిన సలహా బాగా లేదు. కూతురి సీమంతం కోసం, జీవనాధారమైన ఎద్దులను అమ్ముకో మని సలహా యివ్వడం, ఏమీ సమంజసంగా లేదు,'' అన్నాడు.

అందుకు అమరయ్య చిన్నగా నవ్వి, రంగయ్యతో, చూడు, రంగా! మన దగ్గిరకు సలహా కోసం వచ్చేవాళ్ళు, రెండు రకాలు. మొదటిరకం వాళ్ళు, ఏదైనా సమస్య ఎదురైనప్పుడు, సరిఅయిన నిర్ణయం తీసుకోలేక, మన సలహా పాటించాలనుకునే వాళ్ళు. వాళ్ళకు ఆలోచించి, మనం సరిఅయిన సలహాలు యివ్వాలి. ఇక రెండవరకం వాళ్ళు, అప్పటికే ఏదో ఒక నిర్ణయం చేసుకున్న వాళ్ళు. ఆ నిర్ణయం మంచిది కాదని, ఎవరు చెప్పినా మార్చుకోరు,'' అన్నాడు.

''మరి, అలా ఒక నిర్ణయం తీసుకున్న వాళ్ళు, సలహా కోసం మన దగ్గిరకు రావడం ఎందుకు?'' అని అడిగాడు రంగయ్య ఆశ్చర్యంగా.

''మనం ఊరిపెద్దలం కాబట్టి, వాళ్ళు తీసుకున్న, నిర్ణయమేమిటో లాంఛనంగా మన చెవిని వేసిపోతారు, అంతే! చంద్రయ్య మన సలహాకోసం వచ్చిన వాడు. నారయ్య తాను చేయబోతున్న దేమిటో చెబుతూ, మాటవరసగా సలహా అడిగినవాడు. అందువల్ల, ఇక నుంచి నువ్వెవరికైనా సలహా యివ్వదలిస్తే, ఆ వచ్చినవాడు కేవలం, నీ సలహా కోసం వచ్చాడో లేదో గుర్తించి—ఆ తర్వాత సలహా యివ్వు. అలా కానివాడైతే, వాడు చెప్పినది విని, అలాగే అని నీ ఆమోదం తెలియచెయ్యి,'' అన్నాడు అమరయ్య.

రంగయ్య కొంచెంసేపు ఆలోచిస్తూ ఊరుకుని, ''నా సలహాలు కొందరు ఎందుకు పాటించడం లేదో, యిప్పుడు అర్థమైంది. ఏమైనా, అన్నిటికన్నా యిప్పుడు నువ్వు నాకిచ్చిన సలహా సరిఅయినది!'' అంటూ, అన్నను మెచ్చుకున్నాడు.



# చందమామ అనుబంధం—6

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### తేగ్‌బహాదుర్

శిక్కుల తొమ్మిదవ గురువైన తేగ్‌బహాదుర్ 1621 వ సంవత్సరం ఏప్రిల్ 1 వ తేదీన అమృతసర్‌లో జన్మించాడు. ఆరవ గురువయిన హరగోవింద్ కుమారుడాయన. తేగ్‌బహాదుర్ బాల్యం నుంచే బహుముఖ ప్రజ్ఞాశాలిగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. గంటల కొద్దీ ధ్యానంలో గడిపేవాడు. చరిత్ర, సాహిత్యం, గణిత పాఠ్యాంశాలలో విశేష ప్రజ్ఞచూపాడు. గుర్రపుస్వారీలోనూ, ఇతర శస్త్రవిద్యలలోనూ ఆరితేరాడు. 1664 వ సంవత్సరం హరికిషన్‌గురు మరణానంతరం తేగ్‌బహాదుర్ గురువయ్యాడు. ఆనంద్‌పూర్ అనే నూతన పట్టణాన్ని రూపొందించాడు.

ఆ సమయంలోనే మొగలు చక్రవర్తి ఔరంగజేబు భయానకమైన హింసాకాండకు పూనుకున్నాడు. ఇస్లాం మతం పుచ్చుకోమని బ్రాహ్మణులను నిర్బంధించసాగాడు. అప్పుడు కొందరు బ్రాహ్మణులు తమను రక్షించమని తేగ్‌బహాదుర్‌ను కోరారు. తేగ్‌బహాదుర్ ఇస్లాంమతం పుచ్చుకున్నట్టయితే, తాము కూడా సిద్ధంగా వున్నట్టు ఔరంగజేబుకు తెలియజేయమని, బ్రాహ్మణులకు తేగ్‌బహాదుర్ సలహా ఇచ్చాడు. ఔరంగజేబు తేగ్‌బహాదుర్‌ను ఖైదుచేసి–ఇస్లాంమతం పుచ్చుకోలేదా ఏదైనా అద్భుతం చేసి చూపు–అని ఆజ్ఞాపించాడు. తేగ్‌బహాదుర్ నిరాకరించాడు. 1675 వ సంవత్సరం నవంబర్ 11 తేదీన అతడు హతమార్చబడ్డాడు.

## ఎవరాయన?

నిర్మానుష్యంగా ఉన్న పొలాల్లో ఒక యువకుడు వెళుతున్నాడు. రాజు ఆగ్రహానికి గురికావడంవల్ల అతన్ని రాజభటులు వెతుకుతున్నారు.

ఒకచోట ఒక్క చిక్కిన బ్రాహ్మణుడొకడు దర్భ మొక్క కుదుళ్ళకు ఏవో నీళ్ళుచల్లుతూ అతనికి కనిపించాడు.

"ఏం చేస్తున్నావు?" అని అడిగాడు యువకుడు.

"తియ్యటి పానీయాన్ని దర్భమొక్క కుదుళ్లకు చల్లుతున్నాను. చీమలు, తీపితో సహా దీని వేళ్ళను కూడా నాశనం చేసేస్తాయి," అని సమాధానమిచ్చాడు బ్రాహ్మణుడు.

"దర్భవేళ్ళను చీమలు హరించేస్తే నీకు ఒరిగేదేమిటి?" అని అడిగాడు యువకుడు.

"ఈ దర్భముల్లు నా కాలికి గుచ్చుకుని రక్తం చిమ్మింది. అందుకని ఆ మొక్కను సమూలంగా నాశనం చేయడం నా లక్ష్యం," అన్నాడు బ్రాహ్మడు.

బ్రాహ్మణుడి పట్టుదలకు ఆ యువకుడు చకితుడయ్యాడు. ఆ బ్రాహ్మణుడు కూడా రాజుచేత అవమానించబడినవాడే. ఇద్దరికీ స్నేహం కలిసింది.

ఇది కేవలం కథే అయినా, ఇది ఆ బ్రాహ్మణుడి మనస్తత్వాన్ని తెలియజేసే చక్కటి సంఘటన. మరి అయనెవరో తెలుసా?

(VIII పేజీ చూడండి)

## విజ్ఞాన వినోదం






# బీజాంకురం

**సూచనలు :**

కొన్ని చిక్కుడువిత్తనాలు తీసుకుని, రాత్రి ఒక గ్లాసు నీళ్ళలో నానబెట్టండి. పొద్దున, మెత్తగా నాని వున్న విత్తనాల పైతొక్కను జాగ్రత్తగా తొలగించి, లోపలి రెండు దళాలను విడదీయండి. రెండు దళాల మధ్య చిన్న మొలక వుండడం కనిపిస్తుంది. జాగ్రత్తగా పరిశీలించినట్టయితే ఆ మొలకలోని భాగాలు కనిపిస్తాయి. భూతద్దంతో చూసినట్టయితే మొలక భాగాలు మరింత స్పష్టంగా కనిపిస్తాయి.

**ఏం జరుగుతుంది? ఎలా జరుగుతుంది?**

చిక్కుడు విత్తనం రెండు దళాలమధ్య పెరుగుతూన్న చిన్న మొక్క కనిపిస్తుంది. దానిని బీజాంకురం లేదా పిండం అంటారు. జాగ్రత్తగా పరిశీలించినట్టయితే, రెండు ఆకులూ, కాండం భాగాలు కూడా కనిపిస్తాయి. భూతద్దం సాయంతో, ఆకులోని ఈనెలు కూడా చూడవచ్చు. ఇలాంటి బీజాంకురం ఖరాణీలలో కూడా వుండడం మీరు గమనించే వుంటారు.

బీజాంకురం పెరిగేప్పుడు, దాని అడుగుభాగం కాండంగానూ, తల్లి వేరుగానూ రూపొందు తుంది. దాని రెండు దళాలూ దళసరి ఆకుల ఆకారంతో భూమిపైకి వస్తాయి. వీటిని బీజ దళాలు అంటారు. కాని, బీజాంకురం పెరిగేవరకు దానికి ఆహారం సరఫరా చేయడమే ఈ దళాల పని.

చిక్కుడు విత్తనాలలో గుడ్లలో లాగా పిండాలు (బీజాంకురాలు) ఉన్నాయి. అయితే, ఇతర ధాన్యాలలో ఇలా చూడడానికి వీలుకానంత చిన్న బీజాంకురాలు వుంటాయి. నానబెట్టిన కొన్ని చిక్కుడు గింజలను భూమిలో పాతి ఎలా మొలకెత్తుతాయో పరిశీలించండి.



ప్రపంచపు అద్భుతాలు

# హాలికార్నాసస్ స్మారక మందిరం

దాదాపు రెండువేలా ఐదువందల సంవత్సరాలకు పూర్వం ఈజీయన్ సముద్ర తీరంలో హాలికార్నాసస్ అనే అందాల నగరం వుండేది. అది గ్రీకులు నివసించిన ప్రాంతం. నగరంలో, కారిక్ రాజు మౌసోలస్ సమాధి మీద, అతని భార్య అర్టిమీసియా రాణి బ్రహ్మాండమైన స్మారక మందిరం నిర్మించింది. స్మారక మందిరానికి ఒక్కొక్కవైపూ మూడువందల అడుగుల పొడవుగల గట్లు (ఎస్ప్లనేడ్) వుండేవి. ఈ బ్రహ్మాండమైన భవనం ఆనాటి ఏడు ప్రపంచ వింతలలో ఒకటిగా పేరుగాంచింది. క్రీ. పూ. 4 వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ స్మారక భవనాన్ని క్రీ. శ. 4 వ శతాబ్దంలో తురుష్కులు నేలమట్టం చేశారు !




# క్రోసస్ గర్వభంగం

ఆరవ శతాబ్దంలో ఆసియామైనర్‌లోని లిడియా రాజ్యాన్ని క్రోసస్ అనే రాజు పరిపాలించాడు. అతడు ప్రపంచమంతటిలో మహాధనికుడుగా పేరు గాంచాడు. ఈనాటికీ అతన్ని ఐశ్వర్యానికి మారుపేరుగా చెప్పుతుంటారు. అతని కాలంలోనే సోలన్ అనే తత్వవేత్త కూడా ఉండేవాడు. ధనంతోనూ అధికారంతోనూ సాధించలేనిది ఈ భూప్రపంచంలో ఏదీ లేదు. ఈ రెండూ పుష్కలంగా వున్న నేనే అందరికన్నా సంతోషిని—అన్నాడు క్రోసస్.

పక్కనే వున్న తత్వవేత్త సోలన్, "అలా ఎప్పుడూ విర్రవీగకు. ఎప్పుడు ఏమి జరుగుతుందో చెప్పలేము. అందుకే చనిపోయేంతవరకు ఎవరినీ సంతోషి అని చెప్పలేము," అన్నాడు.

తత్వవేత్త మాటలు రాజుకు అంతగా రుచించలేదు!

డెల్ఫీలోని పూజారులు చెప్పే 'దివ్యవాణి' మీద క్రోసస్‌కు నమ్మకం వుండేది. అప్పుడప్పుడే అతడు పర్షియాను ముట్టడించాలని పథకం వేస్తున్నాడు. తన దండయాత్ర ఫలితం ఎలా వుంటుందో డెల్ఫీ దివ్యవాణి నుంచి తెలుసుకోవాలనుకున్నాడు. అతడు పర్షియా మీద దండెత్తినట్టయితే సుసంపన్న రాజ్యం నాశనమవుతుందని డెల్ఫీ దివ్యవాణి చెప్పింది. ఆ మాటలను, తన దండయాత్రతో పర్షియా సర్వనాశనం కాగలదని క్రోసస్ అర్థం చేసుకున్నాడు. **4,20,000** కాల్బలంతోనూ, **60,000** మంది అశ్వసైనికులతోనూ విజయావేశంతో పర్షి

యాను ముట్టడించాడు. అయితే యుద్ధంలో చిత్తుగా ఓడిపోయాడు. లిడియా సర్వనాశనమయింది! అతడు శత్రువుల చేత బందీగా పట్టుబడ్డాడు. పర్షియా రాజు సైరస్, క్రోసస్‌ను సజీవదహనం చేయమని ఆజ్ఞాపించాడు.

భటులు క్రోసస్ కాళ్ళు చేతులు బంధించి, చితివద్దకు లాక్కుపోయారు. అప్పుడతడు, "ఓ! సోలన్!" అని హృదయవిదారకంగా విలపించాడు!

"సోలన్‌ను ఇప్పుడెందుకు తలుచుకుంటున్నావు?" అని అడిగాడు సైరస్.

ఆ తత్వవేత్త తనను హెచ్చరించిన విషయాన్ని తెలియజేసి, అది ఎంతటి పరమ సత్యమో వివరించాడు క్రోసస్!

సైరస్ కరుణతో మనసు మార్చుకున్నాడు. క్రోసస్‌కు విధించిన మరణశిక్ష తొలగించి, అతన్ని తన మిత్రుడిగా గౌరవించాడు!



## గత చరిత్రకేసి చూద్దాం



1. కలకత్తా నగరంగా అభివృద్ధి చెందిన నాటి మూడు గ్రామాలు కొనడానికి ఈస్టిండియా కంపెనీ చెల్లించిన పైకం ఎంత ?
2. వాటిని విక్రయించిన వారెవరు ?
3. కంపెనీ తరఫున కొన్న వ్యక్తి ఎవరు ?
4. ఆ మూడు గ్రామాల పేర్లేమిటి ?
5. గ్రీకు చరిత్రకారుడు టోలమీ 'హెప్టనీసియా' (ఏడుదీవులు) అని పేర్కొన్న ఈనాటి సుప్రసిద్ధ నగరం ఏది ?
6. బొంబాయి నగరం మీద అధిపత్యం వహించిన విదేశీయులెవరు ?
7. బొంబాయిని వశపరుచుకున్న సేనాధిపతి ఎవరు ? ఎప్పుడు వశపరుచుకున్నాడు ?
8. ఆయనకు అది ఎలా స్వాధీనమయింది ?
9. మద్రాసునగరంగా అభివృద్ధి గాంచిన ఒకనాటి గ్రామం పేరేమిటి ?
10. ఢిల్లీనగరం నెలకొనివున్న ప్రాంతానికి గల ప్రాచీన నామం ఏది ?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. మన సౌరకుటుంబంలో వున్న గ్రహాలు ఎన్ని ?
2. గ్రహాలన్నిటిలో పరిమాణంలో పెద్దది ఏది ?
3. అన్నిటికన్నా చిన్నది ఏది ?
4. సూర్యుడికి సమీపంలో వున్న గ్రహం ఏది ?
5. భూమి సూర్యుడికి దూరంలో ఏ స్థానంలో వున్నది ?
6. సౌరకుటుంబంలో గ్రహాలు కాకుండా మరేవైనా వున్నాయా ?
7. మనకు కనిపించే అతి ప్రకాశవంతమైన నక్షత్రం ఏది ?
8. గణితం ద్వారా కనుగొనబడిన గ్రహం ఏది ?

(VIII పేజీ చూడండి)




1· వందలాది కథలలో వస్తూ, అనేకసార్లు జీవించాడని భావించబడే మహనీయుడు ఎవరు ?
2. ఆ కథల సంపుటి పేరేమిటి ?
3. మన దేశంలో పరశురాముడి ఆనతి ప్రకారం సముద్రం నుంచి పైకి వచ్చిందని విశ్వసింపబడే రాష్ట్రం ఏది ?
4. అర్జునుడి శంఖం పేరేమిటి ?
5. పశువుల మాత ఎవరు ?
6. భారతదేశంలోని ఏ దేవాలయంలోని దేవత ఇంకా పెళ్ళి కావలసిన కన్యగానే కొలువబడుతున్నది ?
7. ఈ దేవతచేత సంహరింపబడిన రాక్షసుడు ఎవరు ?
8. రావణసంహారానికి శ్రీరాముడు ఉపయోగించిన ధనుస్సు పేరేమిటి ?
9. ఆ విల్లును ఆయన కిచ్చిన వారెవరు ?
10. రావణుడు ఉపయోగించిన ఖడ్గం పేరేమిటి ?
11. దానిని రావణుడి కిచ్చిన వారెవరు ?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: కొండ

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్సామీ | : పర్వత్ | బెంగాలీ | : పర్వత్ | ఇంగ్లీష్ | : మౌంటెన్ |
| గుజరాతీ | : పర్వత్ | హిందీ | : పహాడ్ | కన్నడం | : పర్వత |
| కాశ్మీరీ | : కోహ్, పహాడ్ | మలయాళం | : పర్వతం | మరాఠీ | : పర్వత్ |
| ఒరియా | : పర్వత్ | పంజాబీ | : పహాడ్ | సంస్కృతం | : పర్వత్ |
| సింధి | : జాప్లు | తమిళం | : మలై | ఉర్దూ | : పహాడ్, కోహ్ |

## మీరు నమ్ముతారా?

* 'ప్లాస్టిక్ సర్జరీ' అధునాతన విజ్ఞానమా?
* రెక్కలాడిస్తేనే పక్షులు ఆకాశంలో వుండగలవా?
* పిడుగు రెండుసార్లు ఒకేచోట పడదా?

కానే కాదు!

* క్రీ. పూ. 8—7 శతాబ్దాల మధ్య నివసించిన భారతీయ శస్త్రచికిత్సవేత్త సుశ్రుతుడు ఈ పద్ధతిని అనుసరించాడు!
* రెక్కలల్లార్చకుండానే కొన్ని పక్షులు గంటల తరబడి ఆకాశంలో వుండగలవు!
* ఒకేచోట ఎన్నిసార్లయినా పడవచ్చు!

# సమాధానాలు

### ఎవరాయన?

చాణక్యుడు; ఆ యువకుడు చంద్రగుప్తుడు.

### చరిత్ర

1. పన్నెండు వందల రూపాయలు.
2. సవర్ణరాయ్ చౌదరి.
3. జాబ్ చర్నాక్.
4. కాళీఘట్, గోవిందపూర్, సుతానాటి.
5. బొంబాయి.
6. పోర్చుగీసులు.
7. జనరల్ అల్బుకెర్క్, 1534 వ సంవత్సరంలో.
8. గుజరాత్‌కు చెందిన సుల్తాన్ బహాదూర్ షాతో చేసుకున్న ఒడంబడిక ద్వారా.
9. మద్రాస్‌పట్నం.
10. ఇంద్రప్రస్థ.

### లోకజ్ఞానం

1. భూమితో సహా తొమ్మిది గ్రహాలు.
2. 88,846 మైళ్ళ అర్ధుకొలత గల గురు గ్రహం.
3. 1,860 మైళ్ళ అర్ధుకొలత గల ప్లూటో గ్రహం.
4. బుధగ్రహం.
5. మూడవది.
6. సౌరకుటుంబంలో అక్కడక్కడా ముఖ్యంగా కుజ, గురు గ్రహాలకు మధ్య కనిపించే అసంఖ్యాకమైన చిన్న చిన్న నక్షత్రాలవంటి ఉపగ్రహాలు.
7. 'డాగ్‌స్టార్, అని పిలువబడే సిరియస్ ఏ నక్షత్రం.
8. నెప్ట్యూన్ గ్రహం.

### సాహిత్యం

1. బుద్ధుడు.
2. జాతక కథలు
3. కేరళ
4. దేవదత్త
5. కామధేనువు (సురభి లేదా నందిని)
6. కన్యాకుమారి.
7. బాణాసురుడు.
8. ఇంద్రధనువు.
9. అగస్త్యముని.
10. చంద్రహాస.
11. శివుడు.



# నెహ్రూకథ – 4

**1919** వ సంవత్సరంలో అనేక బాధాకరమైన సంఘటనలు జరిగాయి. కెనడా నుంచి వచ్చిన 'కామగటమారూ' అనే నౌకలో విప్లవకారులున్నారన్న అనుమానంతో, బ్రిటిష్ ప్రభుత్వం వారు దానిని రానీయకుండా ఆటంకపరిచారు. తీరా నౌక వచ్చాక, అందులోని ప్రయాణీకులను నానా హింసలకు గురి చేశారు.

బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకులని అనుమానించినవారిని ఖైదు చేసి, విచారణ జరపకుండానే జైలుశిక్ష విధించడానికి వీలుగా రౌలట్ చట్టం అప్పుడే చేయబడింది. ఆ చట్టం ప్రకారం పత్రికా స్వాతంత్ర్యాన్ని కూడా రద్దుచేయవచ్చు.





ఆ సమయంలో గాంధీజీకి సుస్తీ చేసింది. గాంధీజీ వ్యతిరేకించినప్పటికీ రౌలట్ చట్టం అమలుచేయబడింది. అప్పుడాయన అఖిలభారత స్థాయిలో వ్యతిరేక ఉద్యమానికి ప్రప్రథమంగా నాయకత్వం వహించడానికి పూనుకున్నాడు. ఆయన తన ఉద్యమానికి 'సత్యాగ్రహ సభ' అని నామకరణం చేశాడు. ఆ సభ సభ్యులందరూ రౌలట్ చట్టాన్ని ఉల్లంఘించాలని నిర్ణయం తీసుకున్నారు.



'సత్యాగ్రహ సభ'లో చేరాలని జవహర్ లాల్ నిర్ణయం తీసుకున్నాడు. అంటే అతడు ఖైదు చేయబడడం ఖాయం. తన బిడ్డ జైల్లో కటికనేలపై ఎలా పరుండగలడని మోతిలాల్ మథన పడ్డాడు. అతడు ఇంటివద్దే నేలపై పరుండి, ఆ కష్టాన్ని ప్రత్యక్షంగా అను భవించి చూశాడు.

పంజాబులో సైనిక చట్టం అమలులో వున్నది. అప్పుడే అమృతసర్ సమీప జలియన్ వాలా బాగ్‌లో ఘోరదుర్ఘటితం జరిగింది. తమ నాయకుల ప్రసంగం వినడానికి వేచివున్న పెద్ద గుంపుపై, కాల్పులు జరపమని దుర్మార్గుడైన ఒక ఆంగ్లేయ సేనాధిపతి జనరల్ డైయర్ సైనికులను ఆజ్ఞాపించాడు. వందలాది స్త్రీ పురుషులు అక్కడికక్కడే మరణించారు. వేలకొలది మంది గాయపడ్డారు.





ప్రజలను భయభ్రాంతులను చేయాలన్న ఉద్దేశంతో, వారిని కొన్ని సందులగుండా పాకుతూ వెళ్ళి, ఎదురుపడ్డ ప్రతి ఆంగ్లేయుడికీ నమస్కరించాలని జనరల్ డైయర్ ఆజ్ఞాపించాడు. విద్యార్థులు రోజూ పదీ, పదిహేనుమైళ్ళు నడిచి, గంటల కొలది మండుటెండలో నిలబడాలని కట్టడి చేశాడు!

సైనిక చట్టం తొలగించబడిన వెంటనే, పలువురు కాంగ్రెస్ నాయకులు పంజాబు పర్యటనకు వెళ్ళారు. పండిత మదన్ మోహన్ మాలవ్యా, స్వామి శ్రద్ధానంద, పునరావాస పథకాలను చేపట్టి, అసంఖ్యాకులయిన సేవా సభ్యులను చేర్చుకో సాగారు.





జలియన్‌వాలాబాగ్ దురంతాలపై దర్యాప్తు జరపడానికి కాంగ్రెస్, అమృతసర్‌కు ఒక కమిటీని పంపింది. ఆ కమిటీకి మోతీలాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజన్‌దాస్ నాయకత్వం వహించారు. చిత్తరంజన్‌దాస్‌కు సహాయపడే బాధ్యత జవహర్‌లాల్‌కు అప్పగించబడింది. డైయర్ జరిపిన దారుణ హింసా కృత్యాలు విని జవహర్‌లాల్ దిగ్భ్రాంతి చెందాడు.

తను వచ్చిన పని పూర్తికాగానే, జవహర్‌లాల్, ఒకనాటి రాత్రి రైలులో ఢిల్లీకి పయనమయ్యాడు. తను ఎక్కిన పెట్టెలో ఒకే పడక ఖాళీగా ఉండడంతో దాని మీదికి ఎక్కి పడుకున్నాడు. తెల్లవారి లేచి చూడగానే, ఆ పెట్టెనిండా సైనికులున్నారు. వాళ్ళమధ్య జనరల్ డైయర్ కూర్చుని, తను జరిపిన ఘోర కృత్యాల గురించి, సిగ్గు విడిచి గొప్పలు చెప్పుకోవడం విన్నాడు.





1919 వ సంవత్సరం అమృతసర్‌లో కాంగ్రెస్ సభ జరిగింది. సభకు మోతీలాల్ అధ్యక్షత వహించాడు. ఈ సభలోనే భారత జాతీయ కాంగ్రెస్ నూతన శకానికి నేతగా గాంధీజీ గుర్తించబడ్డాడు.

లోకమాన్య బాలగంగాధరతిలక్ 1920, ఆగస్టు 1 వ తేదీన బొంబాయిలో కాలధర్మం చెందాడు. శ్రీ అరవిందులతో కలిసి, తిలక్ 1906 వ సంవత్సరం సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ సభలో సంపూర్ణ స్వరాజ్యం కోసం పిలుపు నిచ్చాడు. 1910 వ సంవత్సరం అరవిందులు రాజకీయరంగం నుంచి వైదొలిగారు. తిలక్ మరణంతో, గాంధీజీ కాంగ్రెస్‌నాయకత్వానికి సిద్ధంకాసాగాడు.





తిలక్ మరణించిననాడు ఉదయమే గాంధీజీ, జవహర్‌లాల్ ఇరువురూ బొంబాయి చేరుకున్నారు. జవహర్‌లాల్ మాటలలో చెప్పాలంటే—ప్రేమ పాత్రుడైన తమ మహానాయకుణ్ణి గౌరవించడానికి పదిలక్షలమంది జనాభా గల బొంబాయినగరమే తరలి వచ్చిందా అన్నంత బ్రహ్మాండమైన సభలో వారిద్దరూ పాల్గొన్నారు! —(ఇంకావుంది)



# అనంతయ్య కొడుకు

ఒక ఊళ్ళో, అనంతయ్య అనే భూస్వామి వుండేవాడు. ఆయన దగ్గిర ఒక గుర్రబ్బండి వుండేది. అది ఆ ఊళ్ళోవాళ్ళకు ఎంతో ఉపయోగకారిగా వుండేది. ఊళ్ళో సరైన వైద్యుడు లేడు. అందుచేత, అర్ధ రాత్రి, అపరాత్రి అనక ఊళ్ళో ఎవరికైనా పాము కరిచినా, మరేదైనా అపద ముంచుకు వచ్చినా, పక్కనే వున్న రాజధానికి బండిని పంపి ఆదుకునేవాడు, అనంతయ్య.

కొంతకాలం తర్వాత అనంతయ్య చనిపోయాడు. ఆయన చనిపోయే ముందు, కొడుకు నరసింహంతో, అపదలో వున్నవాళ్ళకు బండీని యిచ్చి అదుకుంటూండమని చెప్పాడు.

నరసింహం, తండ్రికి మాట యితే యిచ్చాడుగాని, దాన్ని నెరవేర్చలేక పోయాడు. వేళకానివేళ ప్రాణం మీదికి వచ్చిందంటూ, ఎవరైనా బండి కోసం వస్తే, బంగారంలాంటి నిద్ర పాడైనందుకు, నరసింహానికి తెగకోపం వచ్చేది. ఆ కోపంలో, ఆ వచ్చినవాళ్ళను నానా మాటలూ అని బయటకు గెంటేసేవాడు.

త్వరలోనే, నరసింహాన్ని బండి అడగడం వృథా అని, ఊళ్ళోవాళ్ళకు తెలిసిపోయింది. అందుచేత, పోయిన అనంతయ్యకు దణ్ణం పెట్టుకుంటూ, ఉన్న నరసింహాన్ని తిట్టుకునేవాళ్ళు.

ఇలా వుండగా, ఒకనాటి అర్ధరాత్రి వేళ, మంగయ్య అనేవాడి ఇరవైఏళ్ళ కొడుక్కు ప్రాణం మీదికి వచ్చింది. వాడు కొడుకును భుజాన వేసుకుని, నరసింహం ఇంటికి వచ్చి, నరసింహాన్ని నిద్రలేపి, బండి కావాలని అడిగాడు.

అలా నిద్ర లేపినందుకు, నరసింహం ముఖం కోపంతో కందగడ్డలా అయింది.

మల్లవరపు మనోహరరెడ్డి



''అడ్డమైనవాళ్ళందరికీ, గుర్రబ్బండి సిద్ధం చేయడానికి, నేను నీ నౌకర్నీ కాదు, బండి నీ తాతసొత్తూ కాదు. మర్యాదగా వెళ్ళు!'' అంటూ తలుపు వేసుకున్నాడు.

ఈలోపల మంగయ్య కొడుకు, తండ్రి చేతుల్లోనే చనిపోయాడు. మంగయ్య దుఃఖ పడి, ఇందుకు కారణమైన నరసింహం మీద పగ తీర్చుకోవాలనుకున్నాడు.

అతను, కొడుకు శవాన్ని అక్కడే వదిలి, తిన్నగా న్యాయాధికారి ఇంటికి వెళ్ళి, ''అయ్యా, నా కొడుకును నరసింహం పనికని పిలిచి, కూలి డబ్బుల దగ్గిర గొడవపడి కొట్టి చంపేశాడు,'' అని నరసింహం మీద ఫిర్యాదు చేశాడు.

చాలా కాలంగా న్యాయాధికారికి కూడా, ఎవరికీ సహాయపడని నరసింహం మీద కోపం వున్నది. ఏదైనా సందర్భంలో, తన చేతికి దొరికితే, నరసింహాన్ని సాధ్యమైనంత కఠినంగా శిక్షించాలనుకునే వాడు. ఆ అవకాశం, యీ రోజు వచ్చింది గనక, నరసింహం అంతుచూసి తీరాలని నిశ్చయించుకున్నాడు.

ఈలోపల న్యాయాధికారి భార్య, ఆయన్ని ఇంట్లోకి పిలిచి, ''ఏమండీ, నరసింహాన్ని శిక్షించాలనుకుంటున్నారా ఏమిటి ?'' అని అడిగింది.

''ఔను, ఆ దుర్మార్గుణ్ణి శిక్షిస్తే గ్రామ మంతా సంతోషిస్తుంది!'' అన్నాడు న్యాయాధికారి.

''భలేవారే! పాముకాటుకు గురై చావు బతుకుల్లో వున్న మన బిడ్డ, అనంతయ్య సకాలంలో బండి పంపి ఆదుకోబట్టేకదా, బతికి బట్టకట్టి, ఈ రోజు కచేరీలో ఉద్యోగం చేసుకుంటున్నాడు. అలాంటివాడి కొడుకు, ఎంత దుర్మార్గుడైనా సమయానికి కృతజ్ఞతతో ఆదుకోక, శిక్షిస్తామంటున్నారే! ఇదేం పాడుబుద్ధి! ఏమైనా సరే నరసింహాన్ని శిక్షించడానికి వీల్లేదు,'' అన్నది న్యాయాధికారి భార్య.

న్యాయాధికారి ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, ఏదో నిర్ణయానికి వచ్చిన

వాడిలా, మంగయ్యను పిలిచి, "మంగయ్యా, అసలు విషయం మరిచే పోయాను. రేపుపొద్దున్నే మాకు కావలసిన వాళ్ళ వివాహానికి వెళ్ళాలి. బండికోసం మనిషిని కూడా పొరుగూరికి పంపాను. ఈ హడావిడిలో తీర్పులూ అవీ కుదరవు. నువ్వు సరాసరి రాజుగార్కి దగ్గరకే వెళ్ళి ఫిర్యాదు చెయ్యి." అని చెప్పాడు.

చేసేదిలేక మంగయ్య, రాజుగారి దగ్గి రకు వెళ్ళి, నరసింహం మీద ఫిర్యాదు చేశాడు.

రాజు, నరసింహాన్ని గురించి, ఆ ఊళ్లో వాళ్ళను కొందరిని పిలిపించి విచారిస్తే, వాళ్ళందరూ నరసింహం మీద అంతా చెడుగానే చెప్పారు. దానితో రాజు, మంగయ్య అభియోగాన్ని నమ్మి, నర సింహానికి ఉరిశిక్ష విధించాడు.

ఆ మర్నాడు, నరసింహాన్ని ఉరి తీయ వలసి వుండగా, సుస్తీ చేసిందంటూ తలారి రాలేదు. అందువల్ల ఉరి నిలిచి పోయింది. తర్వాత పది రోజులు గడిచినా తలారి అంతులేదు.

రాజుకు, నరసింహం ఉరి విషయంలో, తలారి కావాలనే జాప్యం చేస్తున్నాడన్న అనుమానం కలిగింది. ఆయన, తలారి సంగతి తెలుసుకోవడానికి, మారువేషంలో వాడి ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయంలో తలారివాడి భార్య, తలారితో, "ఎన్ని రోజులని, ఒళ్ళు బాగో లేదంటూ, రాజుగారిని మోసపుచ్చుతావు.



ఏ రోజుకైనా, ఆ నరసింహాన్ని ఉరి తియ్యక తప్పుతుందా ?'' అంటున్నది.

దానికి తలారి, ''రాజుగారు నన్ను ఉరితీయించినా, నేను మాత్రం, అ నరసింహాన్ని ఉరితియ్యను. నేను అ ఊరివాణ్ణే కదా! నా చిన్నతనంలో చావుబతుకుల్లో వుంటే, సమయానికి గుర్రబ్బండిని పంపి, వైద్యం అందేట్టు చేసి—నా ప్రాణాలు కాపాడాడు నరసింహం తండ్రి. అలాంటి పుణ్యాత్ముడి కొడుకును, ఉరి తీసి పాపం కట్టుకోలేను. అసలు అనంతయ్య లాంటి వాడి కడుపున, ప్రాణాలు తీసే దుర్మార్గుడు పుడతాడా ? ఇదేదో రాజుగారి తీర్పుదోషం,'' అన్నాడు.

ఈ మాటలు విన్న రాజు ఆలోచనలో పడ్డాడు. ఆయనకు, మంగయ్యను మరొక సారి విచారించాలనిపించింది.

ఆ మర్నాడు ఆయన, మంగయ్యను పిలిపించి, ''నిజం చెప్పు! నరసింహం, నీ కొడుకును చంపాడన్నది అబద్ధం, అవునా ?'' అని గద్దిస్తూ అడిగాడు.

మంగయ్య భయపడిపోయి, రాజుకు నిజం చెప్పేశాడు.

అప్పుడు రాజు, నరసింహాన్ని విడుదల చేయించి, ''నీ తండ్రి చనిపోయినప్పటికీ, ఆయన మంచితనంవల్ల నువ్వు రక్షింపబడ్డావు. నువ్వు బతికివుండీ, నీ దుర్మార్గం వల్ల నిర్దోషినని నిరూపించుకోలేకపోయావు. నిజంగా నువ్వు, మంగయ్య కొడుకును చంపలేదని, మీ ఊళ్ళో అందరికీ తెలుసు. అయినా, ఒక్కరూ ఆ విషయం చెప్పలేదు. ఎందుకంటే— దుష్టుణ్ణి అందరూ ద్వేషిస్తారు. ఈ రోజున నువ్వు కేవలం అనంతయ్యకొడుకువిగా బతికి బయటపడ్డావేగాని, నరసింహంగా మాత్రం కాదు. ఈ జరిగినదానితో నువ్వు నీ బుద్ధి మార్చుకుని, నీ తండ్రి లాగా నలుగురికీ సహాయపడు. అదే నీకు శ్రీరామరక్ష !'' అన్నాడు.

ఈ అనుభవంతో నరసింహానికి, మంచితనంలోని గొప్పదనం తెలిసివచ్చి, జీవితాంతమూ తండ్రి బాటలోనే నడిచాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు తమతో కుశల ప్రశ్నలు చేశాక మునులు చాలా సంతోషించి, తాము తెచ్చిన బదరీఫలాలను అతనికి కానుకగా ఇచ్చి, ''మేము పెద్ద పని మీదే నీ వద్దకు వచ్చాం. భూదేవి కొడుకైన నరకుడు రాక్షస నాయకుడు. వాడిది ఉద్దండ పరాక్రమం. వాడు సముద్రాలు ఇంకించ గలడు, భూమిని చలింపజేయగలడు, కొండలను అణగదొక్కగలడు. వాడు లోకాలన్నిటినీ గగ్గోలు పరుస్తున్నాడు. ఒకసారి బదరీవనానికి వచ్చి, యజ్ఞ కార్యంలో నియుక్తులమై ఉన్న మమ్మల్ని చూసి, దేవతలను గురించి యజ్ఞం చెయ్యొద్దనీ, తనను గురించి చెయ్యమనీ అడిగాడు. అందుకు మేము ఒప్పుకోక పోయేసరికి, వాడు అలిగి తన అనుచరుల చేత మా అగ్నులు ఆర్పించి, మా వస్తువులన్నీ ధ్వంసం చేసి, మా స్త్రీలను చెరపట్టి తీసుకుపోయాడు. మా కర్మకాండకు భగ్నం కలగటమే గాక, మా మర్యాద మంట గలిసింది. మాకు తీరని దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. మమ్మల్ని నువే కాపాడాలి,'' అన్నారు.

మునులు అన్న మాటలకు కృష్ణుడికి ఆశ్చర్యమూ, నరకుడి పైన ఆగ్రహమూ కూడా కలిగింది. కాని అతను ఏ మాటా అనకుండా కొంతసేపు నిశ్చలంగా ఉండిపోయి, ఆలోచనలో పడ్డాడు. అది చూసి మునులు భయపడ్డారు, అనుమానపడ్డారు, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.



అప్పుడు సాత్యకి మొదలైన యాదవ ప్రముఖులు కూడా కృష్ణుణ్ణి హెచ్చరించారు. కృష్ణుడు మునుల కేసి తిరిగి, "మీరు మరొకవిధంగా అనుకోకండి. ఆ రాక్షసుడి చర్యలు విన్న కోపంలో నా మనసు క్షోభపడింది. నేను నిశ్చయంగా ఆ రాక్షసుణ్ణి నిర్మూలిస్తాను. మీకేమీ భయం లేదు. మీరు వెళ్ళి మీ నిత్య కృత్యాలు కొనసాగించండి," అంటూ వారికి అభయం ఇచ్చాడు.

కృష్ణుడిచ్చిన మాటతో మునుల ముఖాలు వికసించాయి. వాళ్ళు కృష్ణుణ్ణి రకరకాల అభినందించి, వెళ్ళివస్తామని చెప్పి అతని వద్ద సెలవు పుచ్చుకుని, బదరికాశ్రమానికి తిరుగు ప్రయాణం సాగించారు.

మునులు వెళ్ళిపోయిన అనంతరం ద్వారకకు దేవేంద్రుడు, మిగిలిన దిక్పాలకులతో సహా దిగి వచ్చాడు. కృష్ణుడు వారికి ఎదురువచ్చి స్వాగతం చెప్పాడు. ఇంద్రుడు యాదవ ముఖ్యుల నందరినీ ఆలింగనం చేసుకుని, వారిపై తనకు గల అభిమానాన్ని ప్రకటించాడు. తరవాత సుధర్మ సభాభవనంలో అందరూ సభ చేశారు.

ఇంద్రుడు కృష్ణుడి చేతిని తన చేతిలోకి తీసుకుని, నేను నిన్ను చూడటానికి ఇలా బయలుదేరి వచ్చిన కారణం చెబుతాను విను. నరకుడనే దైత్య నాయకుడు బ్రహ్మ చేత వరాలు పొంది, విజృంభించి దేవతలను యుద్ధంలో చిత్తుగా ఓడించాడు. వాడి ధాటికి తట్టుకోలేక, ఇళ్ళూ వాకిళ్ళూ వదిలేసి, మనుష్య లోకానికి పారిపోయి వచ్చాం. మా ఇళ్ళలో ప్రవేశించి వాడు మా సంపద లన్నిటినీ కొల్లగొట్టాడు. మా పాట్లు ఏమని చెప్పను? ఎవరికీ సాధ్యం గాని అదితిదేవి కుండలాలను కూడా వాడు కాజేశాడు. మునుల ఆశ్రమాల నన్నిటినీ వాడు బీభత్సం చేశాడు. జగద్రక్షణకు కంకణం కట్టుకుని నువు అనేకమంది రాక్షసులను చంపినట్టు విని

వాడు నిన్ను ఓడించాలని మహా తహతహ లాడుతూ ఉన్నాడు. కనక నువు వెళ్ళి వాడి అంతు తేల్చటం మంచిది. అందువల్ల లోకాలకు ఎంతో మేలు కలుగుతుంది. ఇదుగో గరుత్మంతుడు, నీకు వాహనం కావడానికి నాతో కూడా వచ్చాడు,'' అంటూ గరుత్మంతుణ్ణి చూపాడు.

ఇలా అన్న దేవేంద్రుడితో కృష్ణుడు, ''ఈ విషయాలన్నీ మునులవల్ల ఇంతకు ముందే విన్నాను. నీ రాకతో నా నిశ్చయం మరింత దృఢమయింది. ఇప్పుడే బయలు దేరి ప్రాగ్జ్యోతిష పురానికి పోదాం,'' అంటూ ఆసనం మీది నుంచి దిగి, యాదవ ప్రముఖులకు వీడ్కోలు చెప్పి, తన చక్రాయుధం మొదలైన ఆయుధాలు తీసుకుని, సత్యభామకు కబురు పంపి, ఆమెతో సహా గరుడవాహనం ఎక్కాడు. పెద్దలు దీవించారు, వందిమాగధులు స్తోత్రపాఠాలు చదివారు. ఇంద్రుడు ముందు దారి తీస్తూంటే కృష్ణుడు వెనకగా బయలుదేరాడు. కొంతదూరం నేలమార్గాన వెళ్ళాక, ఇంద్రుడూ, కృష్ణుడూ కూడా ఆకాశమార్గాన ప్రయాణం సాగించారు.

కృష్ణుడికి ఆకాశం నుంచి ప్రాగ్జ్యోతిష పురం కనిపించింది. అది ఎవరికీ ప్రవేశించ సాధ్యంకానిది. దాని సైనికరక్షణలు ఎలా ఉన్నదీ కృష్ణుడు తెలుసుకున్నాడు. నరకుడి మందిరాన్ని రక్షించే రాక్షస వీరులను చూశాడు. కృష్ణుడు ఇంద్రుడికి వీడ్కోలు చెప్పి, ముందుకు వెళ్ళి,





ఆ రాక్షసులను తాకి, అనేకమందిని చెండాడాడు.

మురాసురుడు కృష్ణుడితో తలపడి భయంకరమైన యుద్ధం సాగించాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో మురాసురుడి తల తెగవేశాడు. తరవాత నిసుందుడనేవాడు యుద్ధం ప్రారంభించి, సత్యభామ చేతిని గాయపరిచి, రక్తం కారేటట్టు చేశాడు. కృష్ణుడు మండిపడి, బాణాలతో వాడి చేతులూ, తలా నరికేశాడు. హయగ్రీవుడూ, అఘోరపాలుడూ, విరూపాక్షుడూ, ప్రాపణుడూ, పంచజనుడూ మొదలుగా గల రాక్షసవీరులు ఎనభైనాలుగు వేల మంది కృష్ణుడి చేతిలో చచ్చారు.

నగరద్వారాన్ని రక్షించే రాక్షసులందరినీ చంపి కృష్ణుడు ఆ ద్వారాన్ని సమీపిస్తూండగా రాక్షస సేనలు అతనిపై వచ్చి పడ్డాయి. కృష్ణుడు ఆ రాక్షస మూకను అవలీలగా చించిచెండాడాడు. ఇంతలో నరకుడే యుద్ధసన్నద్ధుడై వచ్చాడు. అతను, ఒంటరిగా యుద్ధానికి వచ్చిన కృష్ణుణ్ణి చూసి, "నన్ను నరకుడంటారు. ఇంద్రుణ్ణీ, ఇతర దేవతలనూ జయించి, మూడు లోకాలనూ సంక్షోభింప జేసినవాణ్ణి. నా దగ్గర ఎంతలేసి వీరుల పరాక్రమాలూ ఎందుకూ పనికిరావు. నువ్వు ఎవరివి? ఎందుకు వచ్చావిక్కడికి? ఈ పెద్ద పక్షి ఎక్కడిది? ఈ ఆడమనిషి ఎవరు? కొంచెం స్పష్టంగా చెప్పు. నిన్నిప్పుడే చంపి, ఈ స్త్రీని వశపరుచుకుంటాను. పారిపోక పోరాడు," అన్నాడు.

కృష్ణుడీ మాటలకు నవ్వి, "నేను కూడా మూడు లోకాలలోనూ ప్రసిద్ధి కన్నవాణ్ణే. నన్ను గురించి నువు విన్నావో, లేదో తెలీదు. నా పేరు వాసుదేవుడు. ఈమె పేరు సత్యభామ, నా భార్య. ఈ పక్షి పక్షిజాతికి రాజైన గరుత్మంతుడు, నా వాహనం. నే నిక్కడి కెందుకు వచ్చానంటే, నిన్ను చంపి లోకకల్యాణం కలిగించటానికి వచ్చాను," అన్నాడు.



నరకుడు చిరునవ్వు నవ్వి, "నీవేనా వాసుదేవుడివి? నీతో యుద్ధం ఎప్పుడు వస్తుందా అని ఉబలాట పడుతున్నాను. నీ శక్తి కొద్దీ యుద్ధం చెయ్యి, నాకు దొరికి ప్రాణాలతో తప్పించుకు పోలేవులే." అంటూ కృష్ణుడితో యుద్ధం ప్రారంభించాడు. వారికి జరిగిన యుద్ధం రామరావణ యుద్ధంలాగా వర్ణించ శక్యంకానిది, మహా దారుణమైనది. ఈ యుద్ధంలో కృష్ణుడు తీవ్రంగా గాయపడి మూర్ఛపోయాడు.

అది చూసి సత్యభామ కంగారుపడక, కృష్ణుడి నుదుట గుచ్చుకున్న బాణాన్ని తీసి, రక్తస్రావం కాకుండా గాయాన్ని నొక్కిపట్టి, కృష్ణుడికి ఉపచారాలు చేసింది. గరుత్మంతుడు తన రెక్కల గాలితో కృష్ణుడికి సేద తీర్చాడు. కృష్ణుడు స్పృహ వచ్చి సత్యభామతో "నేను అలిసిపోయినాను. కాస్సేపు నువు యుద్ధం చెయ్యి." అన్నాడు. సత్యభామ అతని విల్లూ, అమ్ముల పొదులూ తీసుకున్నది.

ఆమె తన పైన ఒక్కసారిగా బాణ వర్షం కురిపించేసరికి నరకుడు, "ఈ కృష్ణుడు తాను యుద్ధం చెయ్యటం మాని, నన్ను జయించటానికి ఆడదాన్ని నియోగిస్తాడా? ఛీ, ఛీ!" అనుకుని, సత్యభామ పైన తీవ్రమైన బాణాలు ప్రయోగించాడు. అవి సత్యభామ రొమ్ములోనూ, చేతులలోనూ, పక్కలలోనూ గుచ్చుకున్నాయి. ఆమె వాటిని లక్ష్యపెట్టక, అత్యంత రోషావేశంతో నరకుడి ధ్వజం విరగగొట్టి, రథాశ్వాలను చంపి, సారథిని చంపింది. నరకుడు బాణం ఎత్తినప్పుడల్లా దాన్ని విరగగొట్టింది. ఇలా మూడు బాణాలు విరిగిపోయేసరికి నరకుడు గద ఒకటి తీసుకుని, బలంగా ఆమె మీద విసిరాడు. దాన్ని సత్యభామ మధ్యలోనే నలుసుల కింద కొట్టేసింది. ఇదే విధంగా ఆమె నరకుడు విసిరిన ప్రతి ఆయుధాన్నీ నుగ్గు చేసేసింది.

సత్యభామ చేసే అద్భుత యుద్ధానికి కృష్ణుడు తృప్తిపడి, ఆమెను కౌగలించు

కుని, నుదుటి మీది చెమట తుడిచి, "అలసిపోయావు, ఇక యుద్ధంచాలించు," అని ఆమెను ప్రశంసించి తన మెడలో ఉన్న రత్నాలహారాన్ని ఆమె మెడలో వేశాడు. ఆ హారాన్ని సంపాదించాలని రుక్మిణీ, సత్యభామా కూడా కోరుకున్నారు. ఇంతవరకు ఇద్దరికీ అది లభించలేదు. అటువంటి హారం ఇప్పుడు సత్యభామకు లభించింది.



కృష్ణుడు సత్యభామ చేతినుంచి విల్లు తీసుకుని తిరిగి యుద్ధానికి ఉపక్రమించాడు. ఈ లోపల నరకుడు మరొక రథం ఎక్కి, శరపరంపరలను కృష్ణుడిపైనా, సత్యభామపైనా, గరుత్మంతుడిపైనా విసిరాడు. కృష్ణుడు అతని కొత్త రథాన్నీ, గుర్రాలనూ, సారథినీ వరసగా ధ్వంసం చేశాడు. అప్పుడు నరకుడు క్రోధావేశంతో గద తీసుకుని, నేల పైకి దిగి, కృష్ణుడి రొమ్ముకు గురిచేసి విసిరాడు. కృష్ణుడు అవలీలగా దాన్ని ఖండించాడు. నరకుడు కృష్ణుడి పైన ఎన్నో ఆయుధాలూ, చివరకు చెట్లూ, రాళ్ళూ కూడా విసిరాడు, కాని ప్రయోజనం లేకపోయింది.

చిట్టచివరకు కృష్ణుడు నరకుడిపైన తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. అది నరకుణ్ణి నిలువునా రెండుగా చీల్చి పారేసింది. నరకుడి చావుతో భూమికి గొప్ప బెడద తీరిపోయింది. భూదేవి మానవాకారంతో వచ్చి, నరకుడి శవాన్ని కౌగలించుకుని, అతని చెవులకు గల దివ్య మణికుండలాలు తీసి, కృష్ణుడి వద్దకు వచ్చి ఏడుస్తూ, చేతులు మోడ్చి, "నువే నాకీ కొడుకును ఇచ్చావు, నువే వాణ్ణిలోకకంటకుడని భావించిచంపేశావు. ఇక దేవతలూ, ఋషులూ సుఖంగా ఉండనీ. ఇవి ఇంద్రుణ్ణి జయించి తెచ్చిన రత్నకుండలాలు. వీటిని తీసుకో. వీడి కొడుకును కాపాడి, వీడి రాజ్యం వాడికియ్యి." అన్నది.

కృష్ణుడు సరేనన్నాడు. భూదేవి అంతర్ధానమయింది. కృష్ణుడు నరకుడి

కళేబరానికి అంత్యక్రియలు జరిపించి, అతని కొడుకైన భగదత్తుడికి రాజ్యాభిషేకం చేయించాడు.

నగరంలో పల అంతులేని నిధులున్నాయి. అవి దిక్పాలకులను జయించి, నరకుడు తెచ్చుకున్నవి. నరకుడి భటులు వాటినన్నిటినీ కృష్ణుడి పరం చేశారు.

మణిశైలం వద్ద పదహారువేల నూరు మంది దేవతాస్త్రీలు నరకుడి చేత చెరపట్ట బడి తెచ్చి ఉంచబడ్డారు. కృష్ణుడు సపరివారంగా అక్కడికి వెళ్ళాడు. ఆ స్త్రీలు కృష్ణుణ్ణి చూసి, "మేము నరకుడి చేత చెరపట్టబడిన దేవస్త్రీలం. ఒకసారి నారదుడు మా దుఃఖం చూసి, చింతించవద్దనీ విష్ణుమూర్తి మానవావతారుడై వచ్చి, నరకుణ్ణి చంపి, మాకు భర్త అవుతాడనీ చెప్పాడు. మేము ఆ ఆశతో నే ఇంతకాలమూ మా కష్టాలను ఓర్చాం. ఇప్పుడు మేము ధన్యత్వం పొందాం," అన్నారు.

కృష్ణుడు వారి కోరికలను మన్నించి, వారిని స్నేహంతో చూసి, వారి కోసం పల్లకీలు తెమ్మని రాక్షసకింకరులను నియోగించాడు. తరవాత కృష్ణుడు మణిశైలమంతా తిరిగి, దాని శిఖరం ఒకటి చెట్లతోనూ, పక్షులతోనూ సహా విరిచి, గరుత్మంతుడిపైన పెట్టాడు. గరుత్మంతుడు కూడా దాన్ని తేలికగా మోశాడు. కొండ శిఖరంతో బాటు కృష్ణుడు కూడా ఎక్కి, ఇంద్రుడి నగరానికి ప్రయాణమై వెళ్ళాడు. అక్కడ శచీదేవీ, ఇంద్రుడూ ఉన్నారు. శచీదేవీ, సత్యభామా కౌగలించుకున్నారు. కృష్ణుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, తాను తెచ్చిన కుండలాలు అతనికి ఇచ్చాడు. కృష్ణుడు నరకుణ్ణి చంపినందుకు శచి సత్యభామను ప్రశంసించింది.

"నీ కిష్టమైనదేదైనా ఇవ్వాలని ఉన్నది, ఏమిటి నీ కోరిక?" అని శచీదేవి సత్యభామను అడిగింది.

"నాకే కొరతా లేదు. నీ స్నేహం తప్ప నా కింకేమీ అక్కర్లేదు," అన్నది సత్యభామ.





# బియ్యంలో బెడ్డలు

రత్నాకరు డనే భాగ్యవంతుడి వద్ద, సుధాముడనే పనివాడుండేవాడు. వాడు యజమాని చెప్పే ఎలాంటి పనినైనా విసుక్కోకుండా ఓపికగా, శ్రద్ధగా చేసే వాడు. రత్నాకరుడు కూడా, సుధాముడి నెంతో అభిమానంగా, ఇంట్లో మనిషిలా చూసుకునేవాడు.

ఇలా వుండగా, ఒక రోజున రత్నాకరు డింటికి, ధనగుప్తుడనే దూరపుబంధువు వచ్చాడు. అయనకు నోటిదురుసు ఎక్కువ. చీటికీ మాటికీ పనివాళ్ళపై విరుచుకుపడి వాళ్ళను నోటికి వచ్చిన మాటలనేవాడు. ఆ విధంగా ఒక రోజున, ఆయన సుధాముణ్ణి కూడా అకారణంగా అనరాని మాటలన్నాడు. ఎన్నడూ మాట పడి ఎరగని సుధాముడు, యజమాని ముఖం చూసి ధనగుప్తుడి నేమీ అనలేక, గుడ్లనీరు కుక్కుకున్నాడు.

రత్నాకరుడు, ధనగుప్తుణ్ణి పక్కకు పిలిచి, "తప్పు చేసినప్పుడే నేను సుధాముడిని మంచి మాటలతో మందలిస్తాను. అలాంటిది నువ్వు, వాడినీ రోజున అకారణంగా తిట్టావు. ఇది మంచి పద్ధతికాదు," అని మందలించాడు.

ధనగుప్తుడు వెంటనే, "గొప్పవాళ్ళకు నోటిదురుసు వుంటుంది. దాన్ని ఎవరి మీద ప్రదర్శించగలం? రాజులపై చూపిస్తే కారాగారం పాలవుతాం. సాటివారిపై చూపిస్తే స్నేహితులందరూ శత్రువులవుతారు. సామాన్యులపై చూపిస్తే, వ్యాపారం దెబ్బతింటుంది. భార్యాబిడ్డలపై చూపిస్తే, ఇంట్లో సుఖశాంతులుండవు. అందుకే మనం అవసరానికి మించిన పనివాళ్ళను పెట్టుకుని, నోటిదురుసుకు తగ్గ తిట్లన్నీ తిట్టుకోవాలి. తిట్టుపడడానికి కాకపోతే పనివాళ్ళెందుకు?" అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



రత్నాకరుడు చిరాకుపడుతూ, ''పని వాళ్ళను తిడితే, మనకు పనివాళ్ళే దొరక్కుండా పోతారు,'' అన్నాడు.

దానికి ధనగుప్తుడు, ''ఈ దేశంలో ఎన్ని మాటలన్నా పడి, పని చేసేవాళ్ళు బోలెడుమంది వున్నారు. దారిద్ర్యబాధ అలాంటిది! పేదవాడి కోపం పెదవికి చేటు, అన్న సామెత వుండనే వున్నది కదా!'' అన్నాడు.

''అయితే మాత్రం, అకారణంగా తిట్టడం తప్పుకాదా? అసహాయతవల్ల, వాడేమీ అనకపోయినా, మనసులో వాడు తిట్టుకునే తిట్లన్నీ శాపాలై, మనను బాధించవా?'' అని అడిగాడు రత్నాకరుడు.

ధనగుప్తుడు నవ్వి, ''అందుకొక ఉపాయం వున్నది. ఏ కారణం లేకుండా తిట్టామనిపించినప్పుడు, తర్వాత మనం పనివాడిని పిలిచి మంచి మాటలాడి, ఒక వెండికాసు యిచ్చామంటే సరి! ఆ పని వాడు, మళ్ళీ మనమెప్పుడు తిడతామా అని ఎదురు చూస్తూంటాడు!'' అన్నాడు.

''అసలు పనివాళ్ళను తిట్టడమెందుకు?'' అన్నాడు రత్నాకరుడు.

''పనివాళ్ళను అదే పనిగా తిట్టడం వల్ల, మన దగ్గరున్న తిట్లన్నీ ఖర్చయిపోయి భార్యాబిడ్డలనూ, అయినవాళ్లనూ అనడానికింకేమీ మిగలవు. అప్పుడు జీవితమెంతో హాయిగా వుంటుంది. నీ సుధాముడి సంగతి యిప్పుడే తేల్చేస్తాను చూడు,'' అంటూ ధనగుప్తుడు, సుధాముణ్ణి పిలిచి, ''ఇందాక నిన్నూరికే తిట్టానని ఏమీ అనుకోకు. అప్పుడప్పుడూ వెర్రికోపంలో, నేనేమంటానో నాకే తెలియదు. ఇదుగో, ఈ రెండు కాసులూ దగ్గిరుంచుకో!'' అంటూ రెండు వెండికాసులు వాడికిచ్చి, ''బియ్యంలో బెడ్డలు కలిస్తే ఏరి పారేస్తాం తప్ప, బియ్యాన్ని ద్వేషించం కదా! అలాగే నా తిట్లూ నువ్వు మరిచిపోవాలి,'' అన్నాడు.

ఆ సాయంత్రం సుధాముడు గట్టిగా ఎవరినో తిడుతున్నట్టు వినిపించి, రత్నా

కరుడూ, ధనగుప్తుడూ వాడు పని చేస్తున్న గదిలోకి వెళ్ళారు. ఆ సమయంలో సుధాముడు బియ్యంలో బెడ్డలేరుతున్నాడు.

"ఎవర్నిరా తిడుతున్నావు?" అన్నాడు రత్నాకరుడు ఆశ్చర్యంగా.

"ఈ బియ్యం అమ్మిన షావుకార్నండి," అన్నాడు సుధాముడు.

"ఆయనేం చేశాడురా, నిన్ను?" అని అడిగాడు రత్నాకరుడింకా ఆశ్చర్యంగా.

సుధాముడు ఒక క్షణం ఆగి, "ఈ బియ్యం నిండా బెడ్డ లేనండి. వరి మొక్కకు బెడ్డలు కాయవు. పంట పండించిన రైతు ధాన్యంలో బెడ్డలు కలప లేదు. ధాన్యం దంచిన పనివాళ్ళెవరూ బెడ్డలు కలపరు. ఆఖరుకు భూమాత కూడా తనకుతానై బియ్యంలో కలిసే ఇలాంటి బెడ్డల్ని తయారు చేయదు. ఈ బెడ్డల్ని బియ్యంలో కలిపింది, స్వార్థపరుడైన షావుకారే! బెడ్డల్నేరి పారేస్తే బియ్యం బాగుంటాయని, నాకు తెలుసు, కానీ ఏరేటప్పుడు, బెడ్డబెడ్డకూ ఆ షావుకార్ని తిట్టి శపించకపోతే, నా కసి తీరుతుందా? ఈ విషయం నన్నేకాదు, బెడ్డల బియ్యం కొన్న ఎవరినైనా అడగండి, చెబుతారు," అన్నాడు.

రత్నాకరుడు, సుధాముణ్ణి మరేమీ ప్రశ్నించకుండా, అక్కడి నుంచి ధనగుప్తుడితో ఇంట్లోకి తిరిగి వచ్చాక, "అంతా విన్నావుగదా, ధనగుప్తా?" అని అడిగాడు.

"విన్నాను. నీ నౌకరు సుధాముడు సామాన్యుడుకాదు,"అన్నాడుధనగుప్తుడు.

రత్నాకరుడు నవ్వి, "మనం నౌకర్లను అయినదానికీ, కానిదానికీ తిట్టి బహుమతు లిచ్చినంత మాత్రాన, వాళ్ళకు మనపై రేగే కసిని పోగొట్టలేం. తాత్కాలికంగా వాళ్లు సంతోషించవచ్చు, అంతే!" అన్నాడు.

ధనగుప్తుడు అవునన్నట్టుతల వూపుతూ, "ఈ క్షణం నుంచీ, నౌకర్లపట్ల నా ప్రవర్తనను సరిదిద్దుకుంటాను. సుధాముడు నాకొక మంచి గుణపాఠం నేర్పాడు. అట్లని వాడికి బహుమతేం యివ్వబోవడం లేదు," అంటూ నవ్వాడు.





# ఏనుగులపంచాయతీ

ఆఫ్రికాలో పెద్ద సరస్సు ఉత్తరతీరాన రామోగీ అనే ముసలివాడు తన ఏడుగురు కొడుకులతోనూ, వాళ్ళ పెళ్ళాలతోనూ. పిల్లలతోనూ జీవించేవాడు. వాళ్ళ గుడిసెలన్నీ కలిసి ఒక గ్రామం లాగా ఉండేది. రామోగీ చనిపోగానే ఆ ప్రదేశం పెద్ద కొడుకుది అయింది. మిగిలిన ఆరుగురూ, కుటుంబాలతో మరెక్కడికైనా వెళ్ళి, నివాసాలు ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది.

వారిలో ఆఖరు వాళ్ళిద్దరూ పోధూ, అరువా అనేవాళ్ళు చిన్నతనం నుంచీ విడరాని జంటగా ఉండేవాళ్ళు. ఒకరు ప్రారంభించిన మాట రెండోవాళ్ళు పూర్తి చేసేవాళ్ళు. చివరకు పెళ్ళి చేసుకునేటప్పుడు కూడా వాళ్ళు అప్ప చెల్లెళ్ళను పెళ్ళాడారు.

అంత అన్యోన్యంగా ఉండటం చేత వాళ్ళు వేరే ఎక్కడికన్నా పోయేటప్పుడు ఒకేచోట నివాసం ఏర్పాటు చేసుకుని, కలిసి జీవిద్దామనుకున్నారు. ఇది అచార విరుద్ధమైనా వాళ్ళు లెక్క చెయ్యలేదు.

ఆ నివాసం ఎక్కడ ఏర్పాటు చేసుకోవాలన్న సమస్య వచ్చింది. రామోగీ బలగం నివసించిన ప్రదేశానికి తూర్పుగా ఒక మహారణ్యం ఉన్నది. దానికి సమీపంగా నివాసం ఏర్పాటు చేసుకుని, అక్కడే వ్యవసాయం చేసుకుందామని ఆ అన్నదమ్ములు అనుకున్నారు.

ఇది చాలా సాహసంతో కూడిన పని. అందుకు చాలా కారణాలున్నాయి. అది అంతూ పొంతూ లేని కీకారణ్యం. అది మంత్రారణ్యమనీ, అందులోకి మనుషులు పోతే ఏ తొండగానో, మరో జంతువుగానో మారిపోతారనీ ఆ ప్రాంతం వారికి హడలు. అందులో ఏనుగులుంటాయి. ఆ ప్రాంతాల వాళ్ళు వాటికి మంత్రశక్తు లున్నాయను

ఆఫ్రికా జానపద కథ

కుంటారు. వాటిని చూసి భయపడతారు. అలాంటి మహారణ్యం అంచున పోధూ, అరువా ఇల్లు కట్టుకుని, జొన్నపంట వేశారు. కంకులు పడి చేను ఏపు మీద ఉన్నది.



ఆ తరుణంలో ఒకనాడు అరువా పశువులను తోలుకుని బయటికి వెళ్ళాడు. పోధూ మాత్రం బద్ధకంగా పక్కమీదే ఉన్నాడు. అంతలో "ఏనుగులు!" అని పిల్లలు కేకపెట్టటం వినిపించింది. పోధూ చివాలున లేచి, చప్పున ఈటె ఒకటి తీసి బయటికి పరిగెత్తాడు.

ఒక పెద్ద ఏనుగుల మంద జొన్నపొల మంతా మట్టగించేస్తూ, తొండాలతో పైరు పీకి తినేస్తున్నది. పోధూ అరణ్యం అంచుకు వెళ్ళి గట్టిగా అరిచాడు. వెంటనే ఏనుగులన్నీ. ఎక్కడివక్కడ చలనం మాని నిలబడి వాడి కేసి చూశాయి.

పోధూ తన చేతిలో ఉన్న ఈటెను ఏనుగులలో కెల్లా పెద్దదాని కేసి బలంగా విసిరాడు. అది ఆ ఏనుగు డొక్కలో దిగ బడింది. ఆ ఏనుగు కోపంతోనూ, బాధ తోనూ ఘీంకరించింది. తరవాత, కూడ బలుకుకున్నట్టుగా ఏనుగులన్నీ అరణ్యం లోకి వెళ్ళిపోయాయి.

ఈ సంఘటనలో పోధూవల్ల ఒక పెద్ద నేరం జరిగిపోయింది. అతను ఏనుగు మీద విసిరిన ఈటె సామాన్యమైన ఈటె కాదు. రామోగీ వంశంలో అది అనాదిగా ఉంటున్నది. ఏ యుగంలోనో నందిజాతి వాళ్ళు దాన్ని తయారు చేశారట. దానికి మంత్రశక్తు లున్నాయనుకునేవాళ్ళు. రామోగీ తన అవసరానికి ఎన్నో ఈటెలు వాడాడు గాని దాన్ని మటుకు వాడలేదు. ఆయన తన వస్తువులలో ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క కొడుక్కు ఇస్తూ ఈ ఈటెను అరువాకు ఇచ్చాడు. అరువా దాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటున్నాడు. తొందరలో పోధూ ఆ ఈటెను ఏనుగు మీద విసిరాడు. అది ఏనుగుతోబాటే మహారణ్యంలోకి వెళ్ళిపోయింది.



అరువా పశువులను తోలుకుని ఇంటికి వచ్చి, తన ఈటె ఎలా పోయిందీ తెలుసుకుని పట్టరాని కోపంతో, "నా ఈటెను నాకు తెచ్చి ఇయ్యి." అని పోధూను అడిగాడు.

"అరువా, నీ ఈటె ఏనుగుతోబాటు మంత్రాల మహారణ్యం మధ్యకు వెళ్ళిపోయింది. ఎలా వస్తుంది? దానికి బదులుగా అంతకన్న మంచి ఈటెలు కావలిసినన్ని కొని ఇస్తాను," అన్నాడు పోధూ.

"నాకు నా ఈటే కావాలి. దాన్ని తెచ్చి ఇవ్వకపోతే నిన్ను చంపేస్తాను!" అన్నాడు అరువా.

"సరే, నీ ఈటె తెస్తాను. లేదా, ఆ ప్రయత్నంలో చస్తాను," అన్నాడు పోధూ.

మర్నాడు ఉదయం ఎవరూ నిద్రలేవక ముందే పోధూ లేచి, ఒక ఈటె చేత పట్టుకుని, తోలుసంచీ భుజానికి తగిలించుకుని, అరణ్యంలోకి ప్రవేశించాడు. అరణ్యం లోపల చల్లగానూ, తేమగానూ, మసక వెలుగుగానూ ఉన్నది. అతను అరణ్యమృగాల బాటలవెంట అరణ్యం లోపలికి పగలల్లా నడిచాడు. కాని ఏనుగుల జాడ తగలలేదు.

కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి కమ్ముకున్న తరవాత అతను ఒక మహా వృక్షం వేళ్ళసందున తొర్రలో చేరి, తాను తెచ్చుకున్న జొన్నరొట్టె తిని, అక్కడే నిద్రపోయాడు. మళ్ళీ తెల్లవారిన జాడలు కనిపించగానే అతను మళ్ళీ నడక సాగించి, చాలా సేపటికి చెట్లమధ్య చిన్న ఖాళీస్థలం చేరాడు. అక్కడ బాగా పాతగిలిపోయిన ఒక చిన్న గుడిసె ఉన్నది. అందులో నుంచి పొగ వస్తున్నది.

పోధూ చూస్తూండగానే గుడిసెలో నుంచి ఒక ముసలిది గొడ్డలి పట్టుకుని బయటికి వచ్చి, ఎండు కట్టెలు పేళ్ళు వేస్తూ, "ఈ వయసులో నాకు చేదోడు లేకపోవటం చేత ఏమి అగచాట్లు వచ్చాయి!" అని గొణుక్కున్నది.

పోధూ ఆమెను సమీపించి, "నేను పేళ్ళు కొట్టి పెడతానమ్మా," అంటూ



ఆమె చేతిలోని గొడ్డలి తీసుకుని, త్వరలోనే పెద్ద పేళ్ళకుప్ప తయారు చేశాడు.

ముసలిది వికవికా నవ్వుతూ, "భలే వాడివి, నాయనా! మనుషులుండే చోటు వదిలి ఇంతదూరం ఎలా వచ్చావు?" అని అడిగింది.

పోధూ తన కథ అంతా ఆమెకు చెప్పాడు.

అంతా విని ఆమె, "ఇలాటి పని మీద ఇక్కడికి రావటం చాలా సాహసమే. నేను నీకు సహాయపడగలనో, లేదో తరవాత చూద్దాం. ప్రస్తుతానికి నువు కట్టెలు కొట్టిపెడుతూ నా దగ్గిరే ఉండు," అన్నది.

అతను ఒక నెలపాటు ఆమె వెంటే ఉన్నాడు. రోజల్లా కట్టెలు కొడుతూనే ఉండేవాడు. రోజల్లా ముసలిది అతన్ని ఏదో ఒకటి అంటూనే ఉండేది. మధ్య మధ్య, సోమరి వెధవ అనీ, పనికిమాలిన వాడనీ తిట్టుతూ ఉండేది.

తనకు ముసలిదానివల్ల ఎలాటి ఉపకారమూ జరగదని పోధూ నిరాశ చేసేసుకున్నాడు. అలాటి సమయంలో ఆమె అతన్ని తన పక్కన కూచోమని, "ఇన్నాళ్ళూ ఇక్కడ వృథాగా గడిపానని అనుకోకు. ధైర్యమూ, ఓర్పూ, మంచితనమూ—ఈ మూడూ ఉంటేనేగాని నువు ఏనుగుల దగ్గిర పని సాధించుకోలేవు. నీలో ఈ గుణాలు ఉన్నాయో లేదో చూశాను. నువు ఒక ఏనుగుకు అపచారం కూడా చేసి ఉన్నావు. ఏనుగులు తమకు జరిగిన అపకారాన్ని మరిచిపోవు. అందుచేత నీకు సహాయంగా ఉండగలందులకు ఒక చిన్న వస్తువు ఇస్తాను," అని నీలం రంగులో వున్న ఒక చిన్న గాజుపూస ఇచ్చింది.

మర్నాడు ఉదయం ఆమె అతనికి ఒక దారి చూపి, ఆ దారిన ఎలా వెళితే ఏనుగులుండే చోటు వస్తుందో చెప్పింది.

ఆమె చెప్పిన ప్రకారమే నడుస్తూ పోధూ నాలుగు గంటల కాలంలో ఏనుగు



లుండే చోటికి వెళ్ళాడు. అరణ్యం మధ్య చాలా విశాలమైన మైదానంలో ఏనుగులు ఉంటున్నాయి. ఆ మైదానం చుట్టూ ప్రహరీ గోడలాగా, పెకలించిన మహా వృక్షాలు ఒకదాని మీద ఒకటి ఎత్తుగా పేర్చి ఉన్నాయి.

ఆ ఆవరణలో కొన్నివేల ఏనుగులు, చిన్నవీ, పెద్దవీ, మగవీ, ఆడవీ ఉన్నట్టు పోధూకు తోచింది. వాటి మధ్య చిన్న కొండలాగా ఒక ముసలి మగ ఏనుగు ఉన్నది. అది ఏనుగుల రాజై ఉండాలి.

పోధూ ఏనుగుల రాజుకు దగ్గిరలో, తల వంచుకుని నిలబడి, మెల్లగా వణక సాగాడు.

ఏనుగుల రాజు ఏదో అన్నది. "నువు ఎందుకు వచ్చావు ?" అని అడిగినట్టు పోధూకు తోచింది. అతను ధైర్యంగా తల ఎత్తి, గట్టిగా, "ఏనుగులారా, మీరు నా పొలంలో మేయటానికి వచ్చినప్పుడు నేను మీపట్ల నిర్దయగా ప్రవర్తించాను. నా సోదరుడి ఈటెను మీలో ఒకరి మీద విసిరాను. అది మీ వెంట వచ్చేసింది. ఆ ఈటె ఇయ్యకపోతే నా సోదరుడు నన్ను చంపుతానంటున్నాడు. ఆ ఈటెను నాకు తిరిగి ఇచ్చినా సరే, మీరే నన్ను చంపినా సరే," అన్నాడు.

చాలాసేపు ఏనుగులు ఏ ధ్వనీ చెయ్యలేదు. తరవాత ఏనుగుల రాజు ఏదో ధ్వని చేసింది. మిగిలిన ఏనుగులు గొణిగాయి. రెండు ఏనుగులు పోధూను దూరంగా ఒక చెట్టు నీడకు తీసుకుపోయాయి.

అప్పుడు ఏనుగుల పంచాయతీ జరిగింది. చర్చ ఎంతకూ తేలలేదు. మధ్య మధ్య ఘీంకారాలు వినిపించాయి. చివరకు పంచాయతీ ముగిసినట్టున్నది. అతన్ని ఏనుగులు మళ్ళీ తమ రాజున్న చోటికి తీసుకుపోయాయి. ఏనుగుల రాజు మళ్ళీ ఏదో అన్నది.

ఏనుగులు పోధూను ఒక చెట్టు వెనక్కు తీసుకుపోయాయి. అక్కడే అనేక ఈటె

లున్నాయి. పోధూ తాను విసిరిన ఈటెను గుర్తించి తీసుకుని, ఏనుగులకు తల వంచి నమస్కారం చేసి, తన కృతజ్ఞత చెప్పుకుని, తిరుగు ప్రయాణమయాడు.

తిరిగి వచ్చేటప్పుడు దారి తప్పాడో ఏమోగాని, అతనికి ముసలిదాని గుడిసె తగలలేదు. ఆమె ఇచ్చిన నీలంరంగు పూస అతని వద్దనే ఉండిపోయింది. దారి తప్పిన కారణంగా అతను తన ఇంటికి చేరటానికి మూడు రోజులు పట్టింది.

తన ఈటె తనకు తిరిగివచ్చినందుకు అరువా చాలా సంతోషించాడు. పోధూ తన వింత అనుభవం అందరికీ చెప్పి, తన దగ్గిర ఉన్న పూసను చూపాడు. దాన్ని ఒకరొకరే తీసుకుని, పరీక్షించి, ఆశ్చర్యమూ, ఆనందమూ ప్రకటించారు. తరవాత అది పిల్లల చేతులు మారేటప్పుడు అరువా కొడుకు, పసివాడు దాన్ని నోట్లో వేసుకుని మింగేశాడు.

దానితో సంచలనం ఆరంభమయింది. పోధూ భార్య, ఆ కుర్రవాణ్ణి నాలుగు వేసింది. అరువా భార్య తన అక్క అని కూడా చూడక ఆమెను నానా మాటలూ అన్నది.

పోధూ అరువాతో, "తమ్ముడూ, నేను నీ ఈటెను పోగొట్టినప్పుడు, దాన్ని తీసుకు రాకపోతే చంపుతానన్నావు. నా ప్రాణం ఒడ్డి దాన్ని తెచ్చాను. ఇప్పుడు నా మంత్రపు పూసను నీ కొడుకు మింగాడు. ఇప్పుడు నువు ఏం చెయ్యబోతున్నావు?" అన్నాడు.

"రేపు నేను వేరే వెళ్ళిపోతాను. కుక్కలూ, పిల్లులూ కలిసి ఉండగలవు గాని అన్నదమ్ములు కలిసి ఉండలేరని మనవాళ్ళు సామెత చెప్పనే చెప్పారు. నా ఇల్లు వేరే కట్టుకుంటాను," అన్నాడు అరువా.

"అలాగే చెయ్యి. కాని నా పూస మింగిన నీ చంటివాణ్ణి మాత్రం నాకిచ్చెయ్యి." అన్నాడు పోధూ.

అరువా అందుకు ఒప్పుకుని, తన కొడుకును వదిలేసి, మిగిలిన తన కుటుంబంతో వేరేచోటుకు వెళ్ళిపోయాడు.





# బింబప్రతిబింబాలు

విశాలనగరంలో వివేకవంతు డనే రాజు ఉండేవాడు. ఆయన ప్రతి ఉదయమూ, సాయంకాలమూ తన భవనం పైభాగానికి వెళ్ళి, అక్కడ చల్లగాలిలో పచారుచేస్తూ సూర్యోదయ శోభా, సూర్యాస్తమయ శోభా తిలకిస్తూ ఉండేవాడు.

ప్రతిరోజూ ఒక కట్టెలు కొట్టేవాడు ఉదయంపూట రాజప్రాసాదం పక్కగా కట్టెలు కొట్టటానికి అడవికి వెళ్ళి, తిరిగి సాయంకాలంపూట కట్టెల మోపుతో తిరిగి వచ్చేవాడు.

ప్రతి ఉదయమూ, సాయంకాలమూ వాడు రాజుకు కనిపిస్తూనే ఉండేవాడు. అయితే వాడు ఉదయంపూట అడవికి పోతూ కనిపించినప్పుడు రాజుకు, "అయ్యో, పాపం! వీడు ఎంత కటిక దరిద్రుడోగద! అసలే ఎముకల గూడులా ఉన్నాడు; ఇంత శ్రమపడితేగాని వాడికి రోజు గడవదు కాబోలు!" అనుకుని జాలి పుట్టుకొచ్చేది. సాయంకాలంపూట వాడు మోపు నెత్తిన పెట్టుకు వస్తూ కనిపించినప్పుడు మటుకు రాజుకు వాణ్ణి చూడగానే ఎందుకో పట్టరాని ఆగ్రహం వచ్చేది; "పాపాత్ముడు వీణ్ణి నిలువునా చీల్చినా దోషం లేదు!" అనిపించేది.

ఒకే మనిషిని చూస్తే తనలో ఉదయం ఒక భావమూ, సాయంకాలంపూట దానికి విరుద్ధంగా ఇంకొక భావమూ, ఎందుకు కలుగుతున్నదీ రాజుకు అర్థం కాక ఆశ్చర్యం వేసింది.

చివరకాయన తన మంత్రిని పిలిచి, అతనితో తన అనుభవం చెప్పి, తనలో ఈ విరుద్ధభావాలు కలగటానికి కారణం ఏమై ఉంటుందో తెలుసుకోమన్నాడు.

మంత్రి సరేనని మూడు రోజులు వ్యవధి కావాలని అడిగాడు.

మర్నాడు మంత్రి పేదవాడి వేషం వేసుకుని కట్టెలు కొట్టేవాణ్ణి అనుసరించి అడవికి పోయి వాడు రోజల్లా పడే శ్రమ చూసి సాయంకాలం వాడి వెనకనే తాను కూడా వచ్చేశాడు.

రాజుగారు ఆ కట్టెలు కొట్టేవాణ్ణి చూసి ఎందుకు జాలిపడుతున్నదీ మంత్రికి అర్థమయింది; కాని రాజుకు వాడంటే ఆగ్రహం ఎందుకు వస్తున్నదీ తెలియ రాలేదు.

రెండోనాడు మంత్రి ఒక సాధువు వేషం వేసుకుని కట్టెలు కొట్టేవాడి ఇంటి కేసి వెళ్ళాడు. ఆయన గుమ్మంలో అడుగు పెట్టటం చూసి కట్టెలు కొట్టేవాడి భార్య లోపలికి ఆహ్వానించి కూచోబెట్టి ఎంతో మర్యాద చేసింది. మంత్రికి గంధపు చెక్కల వాసన ఘాటుగా తగిలింది.

"గంధపుచెక్క ఇంట్లో పుష్కలంగా ఉన్నట్టున్నదే. అది అమ్ముకుని సుఖంగా బతక్క ఇంత అగచాట్లు పడుతున్నారేం, తల్లీ?" అన్నాడు మంత్రి ఎంతో సానుభూతి కనబరుస్తూ.

"బాబూ, గట్టిగా అనకండి! నా మొగుడు కట్టెలు కొట్టేటప్పుడు ఎప్పు డన్నా గంధపు కర్ర కూడా దొరుకుతుంది. దాన్ని ఒక గది నిండా పేర్చి పెట్టాం ఎప్పుడో ఒకప్పుడు రాజుగారు, చావటం జరగవచ్చు. ఆయనను దహనం చెయ్యా టానికి గంధం చెక్క కొనేటప్పుడు ఎంత ధర అయినా ఇస్తారు. అందుకని దాన్ని



చిల్లరగా వాళ్ళకూ వీళ్ళకూ అమ్మక నిలవేసి ఉంచాం!" అన్నది కట్టెలు కొట్టేవాడి భార్య.

రాజుకు కట్టెలు కొట్టేవాడి పైన ఆగ్రహం ఎందుకు కలుగుతున్నదో ఇప్పుడు మంత్రికి తెలిసిపోయింది. కట్టెలు కొట్టేవాడు అడవికి వెళ్ళేటప్పుడు తన దారిద్ర్యం గురించి అనుకుంటాడు, తన ఇంటి ఖర్చుకు సరిపడా కట్టెలు దొరకాలని కోరుకుంటాడు. ఆ సమయంలో రాజు వాడి స్థితి చూసి జాలిపడతాడు.

కట్టెలు కొట్టేవాడు తన పని పూర్తి చేసుకుని ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తాను దాచి ఉంచిన గంధపుకట్టె గురించి అనుకుని, రాజు త్వరగా చనిపోతే అదంతా సొమ్ము అవుతుందిగదా అనుకుంటాడు. ఆ సమయంలో రాజుగారికి వాడి మీద పట్టరాని కోపం వస్తుంది.

కట్టెలవాడి భావాలూ, రాజుగారి భావాలూ బింబ ప్రతిబింబాలు.

మంత్రి కట్టెలు కొట్టేవాడి భార్య వద్ద సెలవు తీసుకుని అక్కడినుంచి బయలుదేరి తన ఇంటికి వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయం మామూలుగానే సభకు హాజరయాడు.

"ఏం, మంత్రీ? నాలో విరుద్ధభావాలు కలగడానికి గల రహస్యం అంతు చిక్కిందా?" అని రాజు అడిగాడు.

"నిజం తెలుసుకున్నాను, మహారాజా. ఆ కట్టెలు కొట్టేవాణ్ణి శిక్షించనని మాట ఇస్తే తమకు యథార్థం విన్నవించుకుంటాను," అంటూ జరిగిన సంగతి అంతా రాజుకు వివరంగా చెప్పేశాడు మంత్రి.

కట్టెలు కొట్టేవాడు దరిద్రుడై ఉండటం చేతనేగదా రోజూ తన మరణం కోరుతున్నాడని గ్రహించి, రాజు వాణ్ణి పిలిపించి, తగిన విధంగా మందలించి, కొంత డబ్బు కూడా ఇచ్చి వాడు అటే శ్రమ లేకుండా జీవితం గడిపే ఏర్పాట్లు చేయించాడు.



# ప్రకృతి వైపరీత్యం

వెన్నెముకలేని జంతువులలో కెల్లా చాలా బరువైనది అట్లాంటిక్ జయంట్ స్క్విడ్ అనే వింత జలచరం. 55 అడుగుల పొడవూ, 2 టన్నుల బరువూ గల స్క్విడ్ ఉన్నట్టు దాఖలాలు ఉన్నాయి. అయితే ఇంతకన్నా పెద్దవే వుండవచ్చని భావిస్తున్నారు. 175 అడుగుల పొడవు గల స్క్విడ్‌ను చూసినట్టు కూడా చెబుతారు. అన్ని జంతువులకన్నా ఈ జంతువుల కనుగుడ్లు చాలా పెద్దవి. ఒక్కొక్క కనుగుడ్డు అడ్డుకొలత దాదాపు 15 అంగుళాల వరకు వున్నది. అంటే ఫుట్‌బాల్‌కు రెండింతలన్నమాట! ఈ జంతువులో నరాలు మరీ ఎక్కువగా వుంటాయి. వీటి నరాలు మనిషి నరాలకన్నా 500 రెట్లు దళసరిగా వుంటాయి.

ఈ జలచరాల ప్రధాన శత్రువులు తిమింగిలాలు. కొన్ని తిమింగిలాల మీద స్క్విడ్స్ చేసిన 18 అంగుళాల అడ్డుకొలతగల గాయాలు కనిపించాయి!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Anant Desai

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఉత్తుత్తి డ్రైవు చేస్తుంటే నువ్వు! రెండవ ఫోటో : ఉబికి వస్తోంది నాకు నవ్వు!!

పంపినవారు : ఆర్. పి. రామరాజు, గిరిపురం, తిరుపతి—517507.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---



# విజయచిత్ర

ఇంటిల్లిపాదినీ ఆనందింపజేసే
సకుటుంబ సినీ మాసపత్రిక

## విజయచిత్ర

ఇప్పుడు మరింత ఆకర్షణీయంగా
సైజులో... గెటప్‌లో... శీర్షికలలో
కొత్తదనాన్ని సంతరించుకుని
వెలువడుతోంది!
వెంటనే ఓ కాపీ కొని చదవండి
ప్రతి ప్రతీ చదివి దాచుకుని
చదివింపజేసే పత్రిక
ఇదేనని మీరే అంటారు!!

విడిప్రతి:
రూ.4/-

సంవత్సర చందా:
రూ.48/-

వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామా బిల్డింగ్స్, మద్రాసు—600026

